## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050015041



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!



ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# ప్రజాహితైషులు

[illegible]

కె. వి. కృష్ణయ్య చౌదరి

తెలుగు పండితులు

బోర్డు ఉన్నత పాఠశాల : తెనాలి

: ప్రకాశకులు :

జాన్సన్ పబ్లిషర్సు. తెనాలి.

1945

క్రయము 0—8—0

# విషయసూచిక

# ప్రజా హిత కథలు

## అశ్వత్థామ పరాభవము

మహాభారతయుద్ధంబునం గౌరవ పాంచాల వీరులు వీర స్వర్గం బలంకరించిన పిదప, భీము గదాఘాతంబులచే దుర్యోధనుండు తొడలు విఱిగిపడియుండెను. సుయోధనునకుం బ్రియము సేయందలంచి అశ్వత్థామ ద్రౌపదియొక్క నిద్రించు సుతుల శిరంబులు ఖండించి, సమర్పించెను. అది క్రూర కర్మంబని జనులు నిందింతురు.

కుమారులయొక్క మరణవృత్తాంతము విని ద్రౌపది కలంతచెందిపోయెను; సహింపంజాలకుండెను; నేలంబడి దుఃఖముచే చెక్కులయందు కన్నీరుగార్చుచుండెను. ఆమెను పైకెత్తి, రమణీయవచనములచే నూరడించుచు, కురులను దువ్వుచు అర్జునుం డిట్లనియె.

చంద్రవదనా! నీవు రాజపుత్రికవు. దుఃఖించుట నీకు ధర్మముగాదు. దయలేక అశ్వత్థామ బాలకుల వధియించెం గదా! ఇంకం జూడుము. నేండే వానిశిరస్సును గాండీవమునుండి విడువంబడిన భయంకరములగు బాణములచే ఖండించి, ఇటకుం దెత్తు. నీ కసిదీర ఆశిరస్సు ద్రొక్కి స్నానముచేయుము.

అని యిట్లామెను ఒడంబఱచెను. కృష్ణుండు మేలు మేలు అనుచుండఁగా కవచము ధరించెను. గాండీవము పట్టెను. రథముపైఁ గపిధ్వజమమరుచుండ అశ్వత్థామ పోయిన దిక్కువెంట రథము తోలించె.

అశ్వత్థామయుఁ దన్నుఁ జంపవచ్చుచున్న అర్జునుని జూచెను. తాను శిశువులను జంపినవాఁడు; కావున తల్లడిల్లు డెందముతో ప్రాణములమీఁది ఆశతో పరుగెత్తుచుండెను.

ఇట్లుశక్తి యున్నంతవఱకుఁ బరుగెత్తెను. తన రథము గుఱ్ఱములు అలయుట చూచెను. ఇఁకఁ బలాయనంబు అశక్యంబని భావించె; వేఱొక శరణంబెద్దియు అగపడకుండె. కావున ద్రోణతనయుండు ఆచమించి, శుచియై, ప్రాణసంకటంబు కలుగుటం జేసి, ఉపసంహారంబు ఎఱుంగకయు బ్రహ్మశిరోనామకాస్త్రమును అర్జునునిపైఁ బ్రయోగించెను.

ఆ దివ్యాస్త్రమును అఖండమైన తేజముతో వెలింగిపోవుచు, ప్రాణభయంకరముగా, వచ్చుచుండ, అర్జునుండు కృష్ణునకు ఇట్లనియె.

కృష్ణా, భక్తరక్షకా! సంసారాగ్నిచే మాడిపోవుచున్న పురుషులకు మోక్షమిచ్చునదినీవే. అనితరించిన నారాయణమూర్తివి. ప్రకృతికి అవ్వలివాఁడవు. ఆదిపురుషుఁడవు. చిచ్ఛక్తిచే మాయను కేవలాత్మ స్వరూపంబుగొని అణఁచివేయుదువు. మాయచే మోహితులైన పురుషులకు ధర్మార్థకామరూపమైన శుభమును ఇచ్చువాఁడవు. సుజనుల రక్షించుటకే జన్మించితివి.

ఇదియొక అఖండ తేజము. భూమ్యాకాశములునిండి, ఎదురుగా వచ్చుచున్నది. దీనిసంగతి తెలియజెప్పుము.

అన శ్రీకృష్ణుం డిట్లనియె.

దుశ్చరితుండగు అశ్వత్థామ వక్రబుద్ధిం జేసి, ప్రాణాశతోం బరువెత్తి, ఈ బ్రహ్మాస్త్రంబును, ప్రయోగించెను. ఈవచ్చునది ఆ బాణాగ్ని. నీవు బ్రహ్మాస్త్రము ప్రయోగించినం గాని ఇది సంహరింపంబడదు. ఈ బ్రాహ్మణపుత్రుండు దీనిని ఉపసంహరించుట ఎఱుంగండు. అర్జునా! శీఘ్రముగా నీ బ్రహ్మాస్త్రమును దీనిపైని బ్రయోగింపుము.

అన అర్జునుండు ఆచమించి, శుచియై, కృష్ణునకు, ప్రదక్షిణించి, తన బ్రహ్మాస్త్రమును బ్రయోగించెను.

అంత నా రెండు బ్రహ్మాస్త్రంబులును భూమ్యాకాశముల నావరించి, ఒకొటి నొకటి తాకుచు, ప్రళయ సమయంబున సంక్షీణముఖాగ్నులయు, సూర్యులను నెట్టులట్టులం బోరుచు త్రిభువనంబులకు భయము కల్గించుచుండెను. ఇది యుగాంతమా ఏమి యని బెదరుచు జనులు చూచుచుండిరి. ఇది యంతయుం జూచి, అర్జునుండు కృష్ణానుమతమున అయ్యస్త్రముల రెంటిని ఉపసంహరించెను.

అంత అర్జునుండు అశ్వత్థామను తటాలునం బట్టుకొనియె. అత్యంతకోపంబున, యూపంబున యాగపశువును బంధించునట్లు అశ్వత్థామను, త్రాటబంధించి, శిబిరమునకుం గొంపోయెను. అర్జునుండట వానిం జంపుదుమని లాగుచుండంగా శ్రీకృష్ణుం డిట్లనియె.

రాత్రివేళ నిద్రించుచున్న బాలురను ఈతఁడు వధించెను. ఆ బాలురు ఏ మున్నాన లేనివారు; ఏపనియుం జేయలేని యసమర్థులు; విలువిద్యయందుఁ గడ తేఱనివారు. ఇంత కంటె వేఱు క్రూరత్వముండునా!

వీఁడు బ్రాహ్మణుఁడే; అయిననేమి! మహాపాతకుఁడు. కాని ప్రాణభయముతో వేడినిట్టూర్పులు విడుచుచు పఱుగెత్తుచున్నాఁడు. అర్జునా! దయతో వీనిని రక్షింపుము.

భయపడినవానిని, పిచ్చిపట్టినవానిని, నిద్రచే మేను మఱచిన వానిని, మద్యపానము చేసియున్న వానిని, భంగపాటునొంది పఱుగెత్తు వానిని, సాధుజడభావము వానిని, శరణుసొచ్చినవానిని, స్త్రీలను, జంపుట అధర్మము.

ఒకింతయుఁ గరుణలేక, తన ప్రాణములను బరప్రాణములచేత రక్షించుకొనువాఁడు నీచలోకప్రాప్తినందును; కాని రాజదండనము నందినచో మాత్రము కళ్యాణము నందును. ఈ బ్రాహ్మణుని దండించుటకు విభ్రాంతి చెందుటయేల!

'అపరాధియయ్యు బ్రాహ్మణుండు వధ్యుండు కాఁడు' అను ధర్మంబు తలఁచి, అర్జునుఁడు వానిని చంపకుండె. ద్రౌపదికిఁ దానుచేసినప్రతిజ్ఞ తలపోసి, బద్ధుండైన అశ్వత్థామను దోడ్కొని శిబిరంబునకు వచ్చె.

అట అంతములేని దుఃఖమునందుచున్న ద్రౌపదికి వణఁకుచున్న యవయవములు కలవాఁడగు నశ్వత్థామను జూపెను.

ద్రోణునిభార్య పతితో సహగమనంబు సేయక ఈకొడు
కుం జూచుకొనుచు బ్రదికియున్నది. నేను మృతపుత్రనై
దుఃఖించుచున్నరీతిగా, అశ్వత్థామను బట్టితెచ్చినందులకై
ద్రోణభార్యయగు గౌతమి ఎంతదైన్యము నందుచున్నదో!
ఇతఁడు మృతుండైనచో ఎంతయు దుఃఖించునో! బ్రాహ్మణహింస
చేయఁగూడదు. దానివలన పాతకము గల్గును. రాజులు బ్రాహ్మ
ణులకుఁ గోపము కల్పింపరాదు. కూర్చిరేని, బ్రాహ్మణకోపము
ఆరాజులను సకుటుంబసమేతముగ భయంకరముగ కాల్చి
వేయును.

ఆ పలుకులు ధర్మంబుగను, దయాన్వితముగను, ఋజువు
గను, న్యాయ్యముగను, స్త్రీయోగ్యంబుగను, బలికిన ద్రౌ
పదివచనములను ధర్మజుండు సంతసించెను. కృష్ణార్జున నకుల
సహదేవాదులు సమ్మతించిరి. సమ్మతింపక భీముండిట్లనియె.

వాస్తవముగా ఈద్రౌపదికి వెఱ్ఱియెత్తినది. పసిబిడ్డలఁ
జంపినవానిఁ జూచి కోపింపదు. పైఁగా వానిని విడిచిపెట్టుఁ
డని చెప్పుచున్నది. అశ్వత్థామ బ్రాహ్మణుఁడైనచో ఇట్టిపని
చేయునా! వీని విడువనేల! చంపుఁడు. మీరుసంశయింతురేని,
పిడికిటిపోటులచే నేనే వీనితలకాయ పగులఁగొట్టెద. అంద
ఱును జూచుచుండుఁడు.

అనిపలుక, ద్రౌపది అశ్వత్థామకు నడ్డంబుపోయె.
కృష్ణుఁడు చతుర్భుజుండుగావున, రెండుచేతులతో భీముని
వారించి, కడమ రెంటను ద్రౌపదిని దొలఁగించి, నవ్వుచు
భీమునితోనిట్లనియె.

పాండవశ్రేష్ఠా! నీవు చెప్పునది వాస్తవము. వీఁడు దుష్టాత్ముఁడుగాఁడు. శిశుహంత, నిందాత్ముఁడు. ఆతతాయి. కావున వధ్యుఁడు. అయినను వేదము "బ్రాహ్మణుఁడు చంపఁదగిన వాఁడుకాఁడు" అని చెప్పుచున్నది. ధర్మదృష్టి ననుసరించి వీని శిక్షించుట నీ కర్తవ్యము.

అని భీముని సమ్మోహపఱచి, కృష్ణుఁడర్జునునితో ద్రౌపదికిని, భీమునకును, నాకును, నీకును సమ్మతంబుగఁ బ్రవర్తింపుమనియె.

అర్జునుండును శ్రీకృష్ణుని యనుమతంబున కత్తిచే అశ్వత్థామ వెండ్రుకలు తఱిఁగి వెండ్రుకలతోడం బుట్టిన దివ్యరత్నమును గ్రహించి, పాశబంధ మడలించి, శిబిరమున నుండి వెడలఁబాపె.

శిశుహంతయగు నశ్వత్థామయుఁ దన తేజముతో గూడ దివ్యమణిని గోల్పోయి, వినమ్రుఁడై, అతిశయించిన చింతతోడను, సిగ్గుతోడను వేగముగా వెడలిపోయెను.

యిచ్చితిని. ఈమాసములోనాకోర్కె నెఱవేర్పవేని నీవీ గృహమునుండి వెడలవలయు. ఇది నా దృఢనిశ్చయము." అనియె.

విలియము వెంటనే యింటనుండి వెడలిపోయెను అతని మనస్సు దినదినపరివర్తనము నొందసాగెను. డోరాను చూచిన కొలఁది యాతనికసహ్యము హెచ్చుగా నయ్యెను. ఇట్లొక మాసము గడచెను. ఈ ముప్పది దినములందును యువతీయువకుల నాకర్షించు పవిత్రప్రేమ విలియమునకు డోరాయెడఁ గలుగలేదు. నిర్బంధవివాహములవలన నష్టములు పెక్కులు పుట్టు. నిర్బంధ వివాహమునందు ఆలుమగలను రాగపాశము బంధింపనేరదు. రాగపాశము లేనిచో వారి జీవితము నరకముగా నడచును. పైకి నాలుమగలుగా నటించుచుండినను అంతరంగముల వారివారి మనోగతులు వేర్వేరై యుండును.

విలియము తండ్రిగృహము వెడలిపోయెను. ఒక కృషీవలుని యొద్దఁ గూలివాఁడుగా జేరి జీవించుచుండె. కొంత కాలమున కాతఁడు 'మేరీమార్గన్' అను నామెను పెండ్లి యాఁడెను. తండ్రిపై పగసాధించుతలంపుతోఁడను, కొంతకుఁ గొంత ప్రేమ యుద్భవించుటచేతను అతఁడీ వివాహము చేసికొనియె.

ఈసంగతి అలనునకుఁ దెలిసె. అతఁడు డోరానుపిలిచి "ఇంకమీఁద విలియముతో నీవొక్కపలుకు పలికినను నీవిట నుండి వెడలిపోవలసియుండును ఇదినాశాసనము" అని వాక్రుచ్చెను. సౌమ్యురాలగు డోరా పినతండ్రియాజ్ఞ మీఱఁజాలక అంగీకరించెను.

పినతండ్రి యొక్క యాజ్ఞ పాలింప మాట యొసంగినను, విలియమువిూఁది ప్రేమ తగ్గలేదు. చిన్నప్పటినుండియు నాతనితోఁ గలిసినదఁట. మనసా యాతని ప్రేమించినదఁట. మీఁదుమిక్కిలి సరళహృదయుఁడట! కట్టా! ఆమె విలియము దురవస్థ చూచి, చూచి, సహింపఁగలదా!

నిజముగ విలియము దుర్భరజీవితమే గడుపుచుండె ఆతనికొక సుతుఁ డుద్భవించెను. కలిగినమున సుతోదయ మయ్యెనో కాని, యాతనికిఁ గష్టపరంపరలు ప్రోత్పురములు చుట్టుకొనుచు రాఁజొచ్చె. భగ్నహృదయుఁడగు విలియము ప్రతిదినము జనకుని గృహమునంటిగొని పోవుచుండెను. అలను ఆతని ముఖముఁజూడఁడయ్యె. నోరా కన్య మాత్రము తాను సంగ్రహింపఁగలదానిని విలియమ్ మేరీదంపతులకు గుప్తముగాఁ బంపుచునేయుండెను.

ఇట్లుండ విలియము విషజ్వరపీడితుఁడై చనిపోయెను. మేరీయు అర్భకుఁడును దిక్కులేనివారైరి. వారికష్టదశను జూచి నోరా మృదులహృదయము బ్రద్దలయ్యెను. ఆస్థితిలో వృద్ధుని యాజ్ఞ ఆమె పాటింపక మేరీనొద్దకుఁబోయెను. మేరీ, తన యభాగ్యస్థితికి నోరాయే కారకురాలని ఆమె నీసుతోఁ జూడసాగెను.

నోరాయంత మేరీనిజూచి “వదినా, ఇంతవరకు నా పినతండ్రియాజ్ఞ మీఱఁజాలకుంటిని. ఇప్పుడునిన్నును నీపుత్రుని ఈస్థితిలోనుండ ఏది యెట్లయినను సరియే యని చూడవచ్చి

తివి. ఇపుడీ బిడ్డను నాకిత్తు మనర్థము. సంతోషముగానున్న ఫలము నా పితరంబ్రికి తీసుకుపోను జూపెదను. అప్పుడు వృద్ధుఁడు వచ్చి విలియమ్సు కొడుకును తీసి నాశీర్వదింపఁ దెచ్చెను.” అని పలికి, యర్భకుని చంకనిడుకొని, గోరా పాలము చాయఁ జనెను.

ఆలిను పంటపొలిములుండెను. కాని యాతఁడు దిబ్బపైఁ గూర్చుండిన గోరానుగూడ లేదు. పాలేరువాండ్రు ఆమె రాకనుగూర్చి వృద్ధునితోఁ జెప్ప సాహసించరైరి. అంధకార మస్ని దిశల నావరించె.

మఱునాఁడు సూర్యోదయ సమయమున గోరా మఱల బిడ్డనెత్తుకొని దిబ్బమీఁదనే కూర్చుండెను. పూలదండ నొకటి గాలుని శిరస్సానమున నుంచె. అపుడు ఆలిను క్షేత్రమునకు వచ్చెను. గోరాను జూచెను. గాలునిజూచెను.

వృద్ధుఁడు సంగతినంతయు గోరావలన గ్రహించెను. ఇదియా సూరుపన్నిన కుట్ర. గోరా! నీవు నా శాసనము తిరస్కరించితివి. నీ ముఖ మెన్నటికిని నాకుఁ జూపకుము.” అనిపలికి ఆలిను గాలుని దీసికొనియె. ఆ పూలదండవీడి గోరా పాదద్వయమునఁ బడియె. వృద్ధుని హృదయ మెట్టిదియో!

గోరా ఒక్కమాఱుగ దిక్కులేనిదాయెను. చిన్నప్పటి సంగతులెల్లయు స్మరణకు వచ్చుచుండెను. పాపమామె వెక్కి వెక్కి యేడ్వసాగెను. ఆస్థితిలో ఆమె యింకేమి చేయఁగలదు.

డోరాయువతి, మేరీగృహముచేరి గడపయొద్ద నిలిచి యుండె. ఆమెను మేరీచూచెను. ఆమెయొద్ద బిడ్డలేకపోవుటచే సంతసించెను. తనయదృష్టమును మెచ్చుకొనెను.

కాని మేరీసంతస మెంతకాలమోనిలువలేదు. డోరావలన నామె యెల్లవృత్తాంతమునువినియె. "అకర్కశహృదయుఁడగు వృద్ధుని వశమున నాబాలుఁడుండఁదగడు. వాడును అట్లే కఠినహృదయుఁడై కన్నతల్లిని దిరస్కరించును. నాబిడ్డని నాకిచ్చి మఱల నిన్నుఁబరిగ్రహింపుమని, వేఁడుకొందును. నిన్నాతఁడు ఇంటఁజేర్పఁడేని, అపుడు, మనముగ్గురము కలిసి యొకయింటనుందము. బాలుఁడు పెద్దవాఁడై మనల నిరువుర సంరక్షించును. అంతదనుక మనము వానిని పోషింతము" అని మేరీ యుద్వేగముతోఁబలికె.

యువతులిద్దఱు వృద్ధునింటికిఁజనిరి. కవాటము బంధింపఁబడి యుండలేదు. వారిరువురు తొంగిచూచిరి. అహా! వారికగపడిన దృశ్యమేమి! వృద్ధుఁడుమనుమని మోకాళ్ళ సందులో నిరికించి, అరచేతులునొక్కుచు, చెక్కిళ్ళను చేతితోఁ బుజుకుచుండెను. అర్భకుఁడాతని గడియారపు గొలుసుమీఁది ముద్రకై తడఁబడి పల్కుచుండెను.

వారిరువురు లోని కేగిరి. వారినిజూచుట తోడనే బాలుఁడు తల్లియొద్దకేగె. వృద్ధునితో మేరీయిట్లనియె. నేనిపుడు డోరాకొఱకు మీయొద్దకువచ్చితి. మీయందామెకు మిక్కిలిప్రేమకలదు. ఈబిడ్డకొఱకుఁగాని విలియంకొఱకుగాని నేను మీ యొద్దకు రాలేదు. విలియము ద్వేషరహితుఁడై

మరణించెను. అవసానదశయందతఁడు, తండ్రిని దేవుఁడాశీర్వదించుగాక' యని చనిపోయె"నని చెప్పి పెడముఖము పెట్టి దుఃఖింపసాగెను. మఱియు నామె యిట్లనియె "అయ్యా, నా బాలుని నాకిమ్ము. మీయొద్దనుంటచే అతఁడును కఠినచిత్తుఁడై నన్ను-కన్నతల్లిని-వదలిపెట్టునేమో!

ఈ తుదిమాట వృద్ధుని హృదయమునకు బాగుగ దాఁకెను. గృహమంతయు నిశ్శబ్దముగానుండె. ఉన్నట్టులుండి వృద్ధుఁడు వెక్కి-వెక్కి యేడ్వసాగెను. "బిడ్డలారా! రండు-రండు-నన్ను విడిచిపెట్టి పోకుఁడు. తప్పంతయు నాదియే. నేనే చేతులార నా కుమారుని జంపుకొంటిని." అని విలపింప సాగెను.

డోరా మేరీలు వృద్ధుని కంఠమును కౌఁగిలించుకొని పలుమాఱు ముద్దుపెట్టుకొనిరి. పశ్చాత్తాపాగ్నిచే వృద్ధుని కోపము భస్మమయ్యెను. అతని హృదయ మపుడు నిర్మల ప్రేమచే తొణికిసలాడుచుండె.

అసల్యవారొక గృహమునందే నివసించుచుండిరి. కొంత కాలము గడచినపిదప మేరీ మఱల వివాహము చేసికొనియె. డోరామాత్రము ఆజన్మము కన్యగానే యుండెను.

# భరతోపాఖ్యానము

ఒకప్పుడు భరతుఁడనురాజు భూతలంబును బాలించు చుండెను. అంతకుబూర్వము 'అజనాభ' మను పేరుగల యీ దేశము భరతుఁడు పరిపాలించుటంజేసి భారతవర్షమను పేర నొప్పె.

భరతుఁడు వేదోక్తకర్మములను యథావిధిగాఁ జిత్త శుద్ధితో నాచరించుచు, అధిక ధర్మాన్వితుఁడై యొప్పుచుండె.

ఇట్లు పెక్కేండ్లు రాజ్యంబుచేసి, పితృ పితామహుల నుండి తనకు లభించిన ద్రవ్యమును, అర్హమగురీతి పుత్రులకుఁ బంచియిచ్చి, విరాగియై అతఁడు పులహాశ్రమంబున కరిగె.

గండకీ నదీ ప్రాంతమందుగల యయ్యాశ్రమంబున భరతుఁడు భగవద్వ్రతంబుధరించి. అతులదివ్యమూర్తియైన బ్రహ్మానందరూపమును శరణుసొచ్చి, జటాజినధారియై, శమ దమాది గుణసంపత్తి గలిగి యుండె.

ఇట్లుండ నొకనాఁడు గండకి యందు స్నానముచేసి భరతుఁడు ప్రణవమంత్రోచ్చారణము చేసికొనుచుండె. పూర్ణ గర్భము ధరించిన యొక లేడి, అట జలపానంబుచేయుచుండె. సమీపమునందలి యొక సింహము లోకభయంకరముగ గర్జించెను. ఆ లేడి అదరిపడి మింటికెగసి, నదినిదాఁటు నెడ దాని గర్భము విచ్ఛిన్నంబై జలంబులంబడియె. తీరముపైఁ

బడి జింక చచ్చెను. గర్భమునుండి జారిపడిన జింకపిల్ల నీటి పైఁ దేలుచుండెను;

భరతుండు కనువిచ్చి యదియంతయుఁ జూచుచుండెను. అతనిచిత్తము కరుణార్ద్రమయ్యె. తల్లిలేని యా లేడిపిల్లను దనయాశ్రమమునకుఁ దీసికొనిపోయి, కడుంగడు ప్రీతితో బోషించుచుండెను. లేడిపిల్లయందుఁ గ్రమంబుగఁ బ్రీతియెక్కువ కాఁగాఁ, గాఁగా, దైవారాధనము క్రమక్రమంబుగ నశియింపఁజొచ్చె,

తనతపంబు చలనమొందుటయే గమనింపక భరతుఁడా జింకపిల్ల యందతిస్నేహంబు నెఱపుచుండె. క్రూరమృగములవలన దానికి హానిగల్గునేమోయని, వనంబుల దాని వెంట వెంటం దిరుగుచుండె. కొంతసేపుదానిని స్కంధములందుంచుకొనును. కొంతసేపు వక్షంబున, కొంతసేపు తొడల మీఁద నుంచుకొని లాలించుచుండెను.

ఆలేడిపిల్లయు నాతనియొద్ద నాడుకొనుచు, నఖంబుల నాతని గీరుచుఁ జెలంగి యాడుకొనుచుండి అంతలో నెటకో నరిగి చనిెను.

భరతుండంత వ్యాకులితచిత్తుండై "ఇంకనిన్నెట్లు కనుగొందు! కట్టా, తల్లిలేని నీవు ఈవనములో లేఁబచ్చిక మేసి బ్రదుకుచుండ మృగరాజు బాధించెనో యేమి! లేక నీవు బ్రదికియుంటివా! నీపాదస్పర్శంబునఁ బవిత్రయగుటకు భూదేవియెంత తపంబాచరించినదోగదా!" అని వగచుచుండె.

ఇట్లు భరతుండు దుఃఖించుచుండ నాలేడిపిల్ల సను దెంచె. భరతుండు సంతసించె.

కొంతకాలమునకు భరతునకంత్యకాలము సమీపించె. అతఁడా లేడిపిల్లనే యాత్మఁగోసిల్పుచు దేహముఁబాసెను. అటుకావున నాతఁడు హరిణజన్మమెత్తి, పూర్వస్మృతితో మెలఁగుచుండె.

ఇట్లు లేడిరూపముననున్న భరతుఁడు తన యధోగతికి అత్యంతము విచారించుచు, బుద్ధిగలిగి, మఱల పులహాశ్రమ సమీపంబునకుఁ జనుదెంచె. అట నెండుగడ్డిపరకలు మేయుచు, సంగమువిడిచి, విరాగియై, మృగదేహత్యాగ మొనరించెను.

తదనంతరము భరతుఁడు అంగిరసుఁడను పేరుగల పవిత్ర బ్రాహ్మణునకు ఆత్మజుఁడై పుట్టెను. మఱల మోహ విఘ్నము తటస్థించునను భయంబునం జేసి, సంతతము హరి చరణధ్యాన పరాయణుఁడై యుండె.

అంగిరసునకు ఇరువురు భార్యలుకలరు; వారిలోఁ బెద్ద భార్యవలనఁ దొమ్మండ్రు పుత్రులుద్భవించిరి. చిన్నభార్య యందు నొకయాడుబిడ్డ, యొక మగబిడ్డయుఁ గలిగిరి. చిన్న భార్యవలనఁగలిగిన మగబిడ్డయే పరమభాగవతుఁడగు భర తుండు. అతండు పూర్వజన్మపరంపరల స్మరించుకొనుచు, అన్యులతోడి సంగంబు విసర్జించుచు, లోకులకుఁదాను ఉన్మ త్తుడుగను జడుఁడుగను అగపడుచుండెను.

తండ్రియగు నాంగిరసుఁడు ఉపనయనాది సంస్కారములుచేసి, కర్మంబులయందు భరతునకు నిచ్ఛగల్గింపఁజూచెను. కాని భరతుఁడు అసమ్మతితోఁ దత్కర్మంబులఁగైకొనఁడయ్యె. ఇట్లు కుమారునకు ఆచారంబులు గఱపఁ బ్రయత్నించుచు చింతతో దేహమువిడిచె. తండ్రితోఁ దల్లియు నగ్నిఁజొచ్చె.

అవినీతులగు సవతితల్లికొడుకులు భరతుని గొప్పతన మెఱుంగలేక, యతనిని వేదవిద్యలు చదువనీక గృహకర్మంబులయందు నియమించిరి. మూఢులగు జనులాతని "ఉన్మత్త జడ బధిర" యని పిల్చుచుండిరి. అతఁడేమియుఁ గోపించుకొనక నియుక్తకార్యములందుఁబ్రవర్తించుచుండెను.

ఇంటియొద్ద నాతనికి ఎట్టి యాహారము పెట్టినను అమృతతుల్యముగా భావించుకొనుచు దేహాభిమానంబు విడిచి, సుఖదుఃఖములయందు సమబుద్ధి గలవాఁడై, నిత్యానంద సుఖానుభవంబు గలిగియుండె.

అతని మలినదేహము, మలినవస్త్రములు, మలిన యజ్ఞోపవీతము చూచి యజ్ఞము చేయుజనులు అతని బ్రాహ్మణాభాసుండని పిలువంజొచ్చిరి. ఎవ్వరేమన్నను అతఁడించుకయుఁ జలింపఁడయ్యె. ఇట్లుండ నాతనిఁ జేని కావలికి నియమించిరి.

ఆపురియందు వృషలుఁడను రాజు గలఁడు. సంతానము కోరియాతఁడు కాళికాదేవికి బలియిచ్చుటకు నొకపురు

షుని సంపాదించియుండెను. కాని ఆపురుషుఁడెట్లో పాఱి
పోయెను.

భృత్యులా పురుషపశువునకై వెదకుచుండిరి. మధ్య
మార్గమున వీరాసనము నందుండి చేనుగాయుచుండిన భర
తుఁడు వారికగపడెను. వారును మంచిపశువు దొరికిన
దనుచు నాతని కాళికా గృహమునకుఁ గొంపోయిరి.

ఆతనికటఁ దలంటి, మృష్టాన్నము పెట్టిరి. వృషలపతి
అతికరాళంబైన ఖడ్గంబుతో భరతుని గాళికకు బలి యీయ
హింసింపనుండెను. భరతుని బ్రహ్మతేజము వెల్లివిరియు
చుండెను. కాళికాదేవికది దుస్సహము కాఁగా హుంకరించుచుఁ
బ్రత్యక్షమై రాజును భృత్యులను సంహరించె.

భరతుఁడించుకయుఁ జలింపక యందఱియందును
విష్ణుభావము సేయుంచి, చండికాగృహంబు వెలువడి, ఎప్పటి
యట్ల చేనికిఁగావలి కాయుచుండె.

ఇట్లుకొన్ని వత్సరములు గడిచె. రహూగణుండను
సింధుదేశపురాజు ఇక్షుమతీతీరముననుండు కపిలమహర్షిని
సందర్శింప శిబికారోహణముచేసి, ఏగుచుండెను. పల్లకిమోయు
వారు చేనియొద్ద నున్న భరతునిఁజూచి, ఇతనిచే శిబిక
మోపింతమని, పల్లకియాతనిమూఁపునఁ బెట్టిరి. భరతుఁడును
మాఱుమాట చెప్పక పల్లకిమోయుచుండెను.

మెట్టపల్లములను గమనింపకయే భరతుఁడు నడుచు
చుండెను. అందువలన గమనము విషమమగుచుండ, రాజు

బెస్తలను మందలించెను. బెస్తలు తప్పంతయు భరతునిదే యనిచెప్పిరి. రాజు భరతుని నిష్ఠురవాక్యములాడెను. భరతుఁడు ఆశరీరమే తనకుఁ గడపటిదియని తెలిసికొనియుంటచే మౌనవ్రతంబు వహించి, యాశిబిక మోయుచుండెను.

మఱల విషమగమనంబుగలుగ రాజు కోపించి, "ఓరీ! బ్రతికియుఁ జచ్చిన వాఁడా! నాయాజ్ఞ దాఁటెదవేల! నిన్ను సన్మార్గమందు నడిపింతును, చూడుము" అని యుగ్రుండై పలికె.

శమదమాది సంపత్తికల భరతుఁడు రాజుతో నిట్లనియె. "అయ్యా, నీవునిజము వచించుచున్నావు. జీవన్మృతుండను నేనొక్కఁడనే కాను. ఆద్యంతములు గల్గుటంజేసి యందఱు జీవన్మృతులే. జరామరణాది సమస్త దుఃఖములు శరీరమునకే గాని యాత్మకులేవు. స్వామి భృత్య సంబంధములును శరీరమునకేగదా! ఉన్మత్త మూకాంధ జడస్వభావముంబొందిన నాయందు నీవాజ్ఞాపించియు నేమియుఁ బ్రయోజనము లేదు గదా!" అని పలికి తన శాడ్మముననందు భారంబు వహించుట నియమితమని యెఱింగి పల్లకి మోచుచుఁ జనుచుండె.

రాజు ఆశ్చర్యముతో ఆయన పాదములపై బడి క్షమింపుమని వేడుకొనియె. తరువాత అమ్మహాత్ముని తన యింట నుంచుకొని పరిచర్యలు చేయుచుండె.

# సిరియాలుఁడు

పూర్వము దుర్వాసుఁడను ఋషియొకఁడుండె. అతఁడు మహాతపస్వి; మఱి మహాకోపి. ఒకనాడాతఁడు పర్ణశాల వాకిట నీవారపాయసాన్నము లేడిపిల్లకు మేపుచుండెను.

అట్టియెడఁ దుంబురుఁడను ప్రమథుఁడు విమానమెక్కి భార్యతోఁ బోవుచుండెను. తుంబురుఁడు జింకపిల్లలకుఁ బాయసము పెట్టుదుర్వాసునిజూచి, ఆశ్చర్యపడి చిటికవైచెను. ఆచిటికకు లేడిపిల్లలు బెదరి పాఱిపోయెను.

దుర్వాసుఁడు తుంబురునిజూచి కోపించి, పుడమిని మనుష్యుఁడవై పుట్టుమని శపించెను. తుంబురుఁడు తాను శివభక్తగృహమునఁ బుట్టునట్లును, శాపాంతమువఱకును దనభార్య దుర్వాసునింట నుండునట్లును అనుగ్రహింపుమనియె. దుర్వాసుఁడందుల కంగీకరించె.

ఆమునిశాపము ప్రేరేపఁగాఁ దుంబురుఁడు కాంచీ నగరము నందొక వర్తకునియింటఁ బుట్టెను. తల్లిదండ్రు లాతనికిఁ జిఱుతొండఁడని పేరు పెట్టిరి. యుక్తవయస్సు రాఁగా నాతనికి తిరువెంగనాంచి యనుకన్యను పెండ్లిచేసిరి. పూర్వజన్మమునఁ గూడఁ దిరువెంగ నాంచియె చిఱుతొండనికి భార్యగా నుండెను.

భార్యాభర్తలిరువురును శివుని నానాకాలములఁ బూజించుచు నెందఱేని భక్తులు తమ్ము దివేఁడినను మహః పూర్వముగా నిచ్చుచుండిరి, జంగమప్రముఖు లేవేళ నేది యడిగిన నదియిచ్చునట్టి గట్టివ్రతము వారిరువురు పట్టిరి. ఇట్లుండ సిరియాలుఁడను నొకకుమారుఁడు వారికిఁ గల్గెను.

కొంతకాలమున కొకనాఁడు మిండజంగ మొకఁడు చనుదెంచి, ముక్కంటి నభిషిక్తు నొనరించుటకు తనకు తూమెఁ డిక్షురసము కావలయునని కోరెను. అంతఁ జెఱుతొండఁడు చెఱుకుఁదోటలుండు పంపానదీ తీరమునకుఁబోయి కావలసిన చెఱుకుగడలు కొని పెద్దమోపుగ గట్టెను. ఎంతప్రయత్నించినను ఆ మోపెత్తలేకుండెను.

అతఁడేమి చేయుటకును దోఁచక దిక్కులుచూచుచుండె. భక్తప్రియుఁడగు శంకరుఁడు మానవాకారమున దిగ్గనవచ్చి, ఆ మోపెత్తుకొని, గమ్యస్థానమునందుఁ బడవైచి మాయమయ్యె. మహాశివుండే తనకట్లు తోడ్పడెనని సంతోషముతోఁ జెఱుతొండఁడు చేజంత్రానఁ జెఱుకుఁ గోలలాడించి, తూమెఁడు రసముతీసి, జంగమునకిచ్చెను; ఆజంగమును దనయుఁజేతనున్న శివున కా రసమున నభిషేకము జరిపెను.

పరమశివుఁడిట్లు చెఱుకుమోపుమోసి కైలాసమునకుఁ జనుదెంచెను. అట నచ్చరలు ఆడుచుఁ బాడుచునుండ జూచుచుండె. మోపుమోసినందున నాయన దేహమునఁ జెమట

టలు పోసెను. ఈనుచేఁ బార్వతి తమ్మిపూబంతినెత్తి పరమ శివునిపై వైచెను.

శివుడంతయు గ్రహించిఁ నాయెడ నపరాధమింతయు లేదు. అచ్చరల యందమును జూచుటవలన నీవూహించు నట్లు నామేను చెమర్పలేదు. మఱి, కంచీపురమందుండు శివభక్తుఁడు చిఱుతొండని చెఱకుమోపు మోయుటచేఁ జెఱుచెమటలు గ్రమ్మినవి" అని యనియె.

అన విని పార్వతి యాశ్చర్యమంది, యిట్లనియె. "దేవా! ఆవీరమాహేశ్వరుని నాకుఁజూపవలయును. నను వెంటనే కంచికిఁ దోడ్కొనిపొమ్ము" శివుఁడంత దాపున నున్న యింద్రునుంగాంచి 'కంచీనగరమందు ఇరువదియొక్క-దినములు కుంభద్రోణముగా వర్షముకురియింపు' మని యాజ్ఞా పించె. ఇంద్రుఁడట్లుచేసెను.

కాంచీపురజనులు ఆ యకాలవర్షమునకు మిక్కిలిభయ పడుచుండిరి. ఆ యిరువదొక్కఁడు దినములు జోరునవాన కురియుచుండినను చిఱుతొండనంబి రేయింబవళ్ళు జంగము లకు ఇష్టాన్నము పెట్టుచుండెను. అతని యిల్లాలు తిరువెంగ నాంచియును, పుత్రరత్నము సిరియాళుఁడును, దాది చందని కయు ఆ ముసురులో నిడువక భక్తకోటికి అన్నదానముచేయు చుండిరి.

వాన వెలిసిన దినమున, చిఱుతొండఁడు, శివార్చన ముగించి, శివయోగివరుల నరయ వాకిటికివచ్చె. శివయోగి

వరు లెవరును అగపడరైరి. "జోడువర్షము కురియునపుడును శివభక్తులనేకులు మోసలనిండియుండెడివారు. నేఁడొక్కఁడును లేఁడు. ఇదేమి చోద్యమ"ని యాతఁడాశ్చర్యపడి "వంట తయారుచేయు"మని భార్యకుఁజెప్పి, వేవేగవీధికిఁబోయెను.

అతఁడట్లు కంచియెల్లనుబరికించి పరికించి ఎందునొక్క జంగముం గానక, కోటవదలిపోయి, పురబాహ్యప్రదేశమున నొకపాడుగుడియందు నొక ముదుసలిశివభక్తుని జూచెను. ఒకముసలియవ్వ, గ్రుడ్డిది, యాతనిపాదములొత్తుచుండెను.

చిఱుతొండఁడు వారినిజూచి పరమానందభరితుఁడై, "దేవా! మీరును మీముసలియవ్వయు నేఁడు మాయింటికి వచ్చి శివార్చనము సలుపవలయు"నని విభూతి నిచ్చెను.

ఆముసలిజంగమిట్లనియె. 'అడిగిన యర్థమీయ వను వ్రతమునుగదా మీయింట! నీకుఁ బుత్రసంతానము గలదా! వృథాప్రశ్నములేల. నాకోర్కి వినుము. నేను నిరాహార వ్రతము గైకొంటిని. ఆనోమున కుద్యాపనము పశూపహారము. ఆపశువు నరుఁడు. ద్విజుఁడై యుండవలయును. ఆరోగ్యవంతుడై యుండవలయును.

మఱియు నాతని తల్లిదండ్రులు, వానికి వధుగు చేసి పాకమొనరించి పెట్టవలయును. ఇది నీకుహితమేని విభూతి కొందును. బాగుగా నాలోచించుకొమ్ము. నీకుమారునే పాకము చేయవలసివచ్చునేమో! నీయింటనందఱు నీమాట యంగీకరింతురా! ఇంటికిఁ బోయి కనుగొనిరమ్ము.

చిఱుతొండనంబి తనభార్యాపుత్రుల శివభక్తి యగ్గలమని తెలిసియు శివయోగితో వాదప్రతివాదము లేల యని తనయింటికిఁ బోయెను. అంతయు భార్యకెఱింగించెను. ఆమె సంతోషముతో నంగీకరించె. దాదియగు చందనికయు నొప్పుకొనియె. అటుమీఁదఁ జిఱుతొండనంబి శివయోగిని దెచ్చుటకుఁ బోయె. అది యిట్లుండె.

ముసలి వేషము దాల్చి వచ్చిన మహేశ్వరుఁడు ఆ వేషముమాని, వేఱొండు వేషముంగొని చిఱుతొండనంబి కుమారుఁడగు సిరియాలు మనముఁ జలింపఁ జేయు నిచ్ఛతో నాబాలుఁడు పఠించు నొజ్జయింటికిఁ బోయె. ఆటసిరియాళుఁడు నీలకంఠస్తవము చదువుచుండెను. మాయాశివయోగి సిరియాళునితో నిట్లు చెప్పె. "కుమారా! నీతండ్రి నిర్దయుఁడై యొకానొకయోగికి నిన్నుఁ జంపి ఆహారముగాఁ బెట్టఁబోవుచున్నాఁడు. నీవంగీకరింపకుము. బ్రతికియున్న బలునాకేరి కొని తినవచ్చును. ఎక్కడికేనియుఁ బోయి యీయాపద తప్పించుకొనుము."

సిరియాళుఁడు చెవులు మూసికొని ఇట్లనియె. "శివశివా- ఇట్లనకుఁడు. పుడమిలో పరార్థమై శరీరధనము వ్యయించుటకంటె నధికమేమిగలదు" మాయాయోగి చేయునదిలేక సిరియాళునకు అచటివారు భయమందునట్లు, మూర్ఛరప్పించెను. అంత నాదేశికేఁడు సిరియాలుని నొసటవిభూతిఁ బ్రామగా సిరియాలునకు మూర్ఛ దెలిసెను. మాయాయోగి వెడలిపోయెను.

అటఁ జిఱుతొండనంబి శివయోగియున్న గుడికిఁ బోయెను. అచటఁ బూర్వపుజోగి యగపడక కుష్టువ్యాధి బాధితుఁడగు నొక శివయోగి యగపడెను. చిఱుతొండ నంబి వానికి నమస్కరించి, వీపుమీఁద వైచుకొని, వెనువెంట మునలియవ్వ కఱ్ఱపట్టుకొని వచ్చుచుండ, శివస్తోత్రముచేయుచు బిరబిర నింటికివచ్చెను.

చిఱుతొండఁడును అతని భార్యయు ఆవృద్ధదంపతు లకు సత్కార మొనరించి శివపూజ చేసికొనుటకు వారినొక యేకాంత మందిర మందుంచిరి. ఇంతలో మేనమామలు బహు విధ భక్ష్య భోజ్యములు సిరియాలునకుఁ గొని తెచ్చిరి.

అటుమీఁద నొకపిచ్చి బాలెంతరాలు-తాపసపురంధ్రి 'మాపాపనికిఁ బాలుపోయుమమ్మా' అని వేడుచువచ్చి, తిరు వేంగనాంచిని బిలిచి, పాలు పోయించుకొని యిట్లనియె. "ఊరిలో గోలగానున్నది. నీమగనికి బుద్ధిలేకపోయినను నీకైన నుండవలదా! సుతునిఁ జంపుటమీకు ఉచితమా!"

తిరువేంగనాంచి "సర్వము శివమయము. ఇఁక నీయర్థ మునకుఁ జింతింపఁనేల" యని యామెను మంచిమాటలతోఁ బంపివేసెను. పిదపఁ బాఠశాల యందున్న సిరియాలునిపిలిచి కొనివచ్చిరి. అతఁడు మేనమామలు తెచ్చిన భక్ష్య భోజ్య ములు కడుపార భక్షించి యాడుకొనుచుండెను.

అప్పుగిది యాడుకొనుచుండిన కుమారుని దల్లి చేరఁ దీసి యలంకరించెను. అతఁడు తల్లిదండ్రులకుఁ దనకష్టంబొక

శ్రమ లేదనియు, తాను శివయోగికి మాంసాహారమొయ్యెద ననియు జెప్పెను.

ఆతరున వారుమువ్వురును, చందనికయు ఏకనిశ్చయు లైరి. తల్లి యాతని తొడలపైఁ బరుండఁబెట్టెను. చందనిక యాతనినితనహస్తములతోఁ బట్టుకొని యుండెను. చిఱుతొండఁడు చురకత్తితో నాచిఱుతనిమెడ గ్రక్కునద్రెవ్వి, నమశ్శివాయ మంత్రము పఠించుచుండెను. సిరియాలునిశిరము భూప్రదేశమునఁ బడియు వికాసము దప్పకయుండె.

అంత నారిరువేంగనాంచియు, చందనికయు, కటిక డెందమున సిరియాలుని బహుభంగులవండిరి. పిదప భోజన శాల శుద్ధిచేసి, "భోజమునకు రావచ్చు"నని తెలిపిరి.

మాయాయోగియు, నాతనిభార్యయుబంగరుపీటలపైఁ గూర్చుండిరి. చిఱుతొండఁడును తిరువేంగనాంచియు వారిని యథావిధి నర్చించిరి. సర్వపదార్థములు వడ్డింపఁబడియె. ఆర గింపుఁడని చిఱుతొండఁడు వారిని ప్రార్థించెను.

మాయాయోగి, అందుఁ బసిబాలుని పుర్రెలోని మాంసములేమిఁ దెలిసికొని, "అయ్యో, మావ్రతమునకు భంగము గలిగె. అధమాంగమాంసము నేనెట్లు భుజింతును! అనియె. తిరువేంగనాంచి, కుమారుని పుర్రెలోని మాంసము ముందుబెట్టి 'తినుము'ని వేఁడెను,

అంతట శివయోగి "నేనొకటనే యెట్లు భుజింతును! వెండియు మగబిడ్డఁడులేని నిర్భాగ్యునింట నే భుజింపను. నీ కుమారుని బంతికి రప్పింపుము" అనియె.

చిఱుతొండఁడు నివ్వెఱపోయి, "మహాత్మా! నా కొకఁడే కుమారుఁడు, వానినిజంపి స్వాములవారికి ఆరగింపఁ బెట్టితిని. ఇఁక నేకుమారుని బంతికిఁ దీసికొనిరాఁగలను? అయ్యా! కూరలు చల్లఁబడును. తడవుచేయక భుజింపుము" అని వేఁడికొనియె.

మాయాయోగి యిట్లనియె. "నీభార్య మహాపతివ్రత. ఆమెను నీకుమారుని బిల్వఁబంపుము. వచ్చినసరియె. లేకున్నచో మన మే భుజంతము."

మగనియానతిచేఁ దిఱువేంగనాంచి, ఎలుఁగెత్తి "రారా నాతండ్రీ-సిరియాలా!" అని పిలిచెను. అంతలో నాబాలుఁడెటనుండియో, తల్లిదండ్రులమన ముప్పొంగ, కడు వడి చనుదెంచెను.

వెంటనే వారికి మహేశ్వరుఁడు ప్రత్యక్షమయి "చిఱు తొండనంబీ! నీవు తుంబురుఁడవు, సిరియాళుఁడు కుమార స్వామి, తిరువేఁగనాంచి యచ్చరి. మీరు శరీరముతోడఁ గైలాసమునకురండు" అని యాజ్ఞాపించె.

అంత జిఱుతొండఁడు "వీరమహేశ్వరాచారము వదలక మేము ఏడువాడల వారము కలిసి వర్ధిల్లుచున్నారము. ఇటువంటి చుట్టములఁబాసి నేనొకఁడనే యెట్లువత్తును!" అని ప్రార్థింప, మహేశ్వరుఁడు దయాహృదయుఁడై ఏడు వాడలవారికి కైలాసమునకు రా ననుజ్ఞయిచ్చి అంతర్ధానుఁ డాయె.

# గరుడసత్త్వోపాఖ్యానము

పూర్వము హరనాథుండనురాజు వింధ్యావళీ రాష్ట్రమును పరిపాలించుచుండెను, అతఁడు వీరవరేణ్యుఁడు; మహాదాత; రాజ్యపరిపాలనముననమర్థుడు; దీనులపట్ల కల్పవృక్షము; అందఱయెడను దయామయుఁడు; ఎట్టిపట్టునను ధర్మబద్ధుడు.

ఆమహానుభావునకు సమస్తము గలదు. కాని పుత్రలాభము మాత్రము లేకపోయెను. బిడ్డలకొఱకు కాతఁడు పెక్కండ్రు భార్యలను వివాహమాడెను. ఏమిలాభము. బిడ్డలుపుట్టరైరి. దైవాధీనంబునకు నరుండేమి చేయగలడు? పుత్రులకొఱకై అతఁ డారాధింపని దైవతములేదు; చేయని సత్కార్యములేదు; ఈయని దానములేదు.

ఇట్లుండ నొక్కనాటి నిశాసమయంబున రాజు నిద్రించుచుండఁగా స్వప్నమున ఒక మహాపురుషుండగపడి, రాజుతో నిట్లనియె, "రాజా! నీవు విచారముచే సరిగ నిద్రించుటయునులేదు. నీదుఃఖము మాకుదెలియును. ఆపదలకోర్చి కదా సౌఖ్యము లనుభవింపవలయును. తనయుఁడు వలయునని నీవెవ్వరును ప్రత్యక్షముగ స్పష్టముగఁ గోరియుండలేదు; అక్కా! ఎంతనిబ్బరము! నీప్రజలు మాత్రము రాజపుత్రునకై వాపోవుచున్నారు. సరియె. ఎట్లయిననేమి! నీకు సంతానము కలుగు కాలము సమీపించినది. ఉదయమునఁ గాలకృత్యంబులు తీర్చుకొని, దైవప్రార్థనము చేసికొని, పాడు

కారియై యుద్యానవనమునకుఁ బొమ్ము. చక్కని దానిమ్మ పండును తెప్పించుకొని, నీయిష్టము వచ్చినన్ని గింజలను లెక్కించి తినుము. లెక్కపెట్టు విషయమున అప్రమత్తుఁడవై యుండుము" అనిపోయెను.

రాజేంద్రుండు ఉదయముననే మేల్కాంచి, రాత్రి స్వప్నవృత్తాంతమును దలఁచికొని, ఆశ్చర్యసంతోషములను పొందె. భక్తివిశ్వాసములతో ఉద్యానవనమునకేగి తనకు మిక్కిలి ప్రియురాండ్రగు ఏబదిమంది భార్యలను దలఁచుకొని లెక్కించి ఏబది గింజలనుదినెను. అంత క్రమంబున నయ్యం దఱు సుందరీమణులకు గర్భోత్పత్తియయ్యె. మందయాన యను నొకసుందరికి గర్భచిహ్నము లగపడకుండె.

రాజు ఆమెపై మిక్కిలికోపించి, దుష్టురాలుగా నను మానించి, చంపనుంకించెను. మంత్రి యపుడు రాజుతో విన్న వించె. "రాజా! మహాపతివ్రతయగు మందయానను అవమా నింపకుము. అందఱును సమానప్రకృతిగల వారలై యుండరు. తొందరపడి యీయామెగర్భమును వమ్ముచేయకుము. నీకింకను కోపముపోదేని, ఈమెను నీతమ్ముఁడగు శ్యామసుందరుని యొద్దకు శ్రీపురంబునకు పంపుము. గర్భచిహ్నము లగపడిన యాతఁడు మనకెరిగింపఁగలఁడు." అనఁగా రాజట్లచేసె.

శ్రీపురంబున మందయానకు గర్భచిహ్నములు గనబడఁ జొచ్చెను. పదియవ మాసంబున నాకెయొక చక్కని పుత్రునిఁగాంచె. శ్యామసుందరుఁ డా శిశువార్తను వాని

నాధున కోరిగించె. రాజుసంతసించి ఆమె నచట నుంచుటయే మంచిదని తలంచెను.

ఇచటను నలువది తొమ్మండ్రుగురు భార్యలు ప్రసవించి కుమారులం గాంచిరి. రాజునకు మహాసంతోషముగా నుండె.

అచట రాజునాజ్ఞచే ఆపుత్రునకు శ్యామసుందరుఁడు గరుడసత్త్వుఁడను నామకరణముచేసి మహోత్సవముచేసెను.

గరుఁడసత్త్వుడు క్రమంబున సర్వశాస్త్రములు యుద్ధవిద్య లభ్యసించి పదునెనిమిది వత్సరముల ప్రాయమువాఁడయ్యెను. ఆతఁడొక్కనాఁడు తనతల్లితోనిట్లనియె "అమ్మా! నేనిఁక శ్రీపురంబునం దుండఁజాలను. నన్నింతకాలము ఇచట నుంచుటలో నాతండ్రి యభిప్రాయమేమియో తెలియకున్నది. అట నాసోదరులు తండ్రికి చేదోడై వాదోడై యుండఁగా నేనిచట వ్రేళ్ళు కొఱుకకొనుచుఁగూర్చుండఁజాలను. నీవు వీరమాతవను విషయము శీఘ్రముగా ప్రకటితము కావలయును," అన నామెయు సంతసించి "నీజనకుండు పిలుచునంతకు ఇట నుండుటయే మంచి" దని చెప్పెను. ఆ మాటలు రుచింపక గరుడసత్త్వుం డిట్లనియె, "తల్లీ! ఇఁక వేచియుండజాలను. యుద్ధములం దాతనికి సాయ్యపడవలయును. పరాక్రమమును జూపి యాతని మెప్పువడసికొని నన్నాతని సుతుండనని తెలుపుకొనను." అనిన తల్లి యెట్టకేలకు ఒడంబడియె.

అంత గరుడసత్త్వుడు అడ్డగించునను భయమున వీని
తండ్రి కేమియుఁ దెలుపక, వేఁటకు బోయెదనను మిషతో
శ్రీపురంబును విడచి కతిపయ ప్రయాణంబుల వింధ్యావలిఁ
జేరెను. అతఁడు రాజమార్గమున గ్రుమ్మరుచుండఁగా, రాజు
చూచి బిలిపించి "నీవృత్తాంతమేమి! నీ వెవరవు" అని యడి
గెను. గరుడసత్త్వం డిట్లనియె. "నరేంద్రా! నేను ద్వీపాం
తరమునఁగల బృహత్కాముఁడను రాజయొక్క పుత్రుడను.
ప్రపంచదర్శన యాత్రాపరుఁడనై యిటకు వచ్చితిని.నీకు శత్రు
భయమెక్కువగా నున్నదని తెలిసికొని, యుద్ధవ్యాపార
ములయందు నీకు సేవయొనర్చి, నీకు సంతోషము గల్గింప
నెంచితిని." అనఁగా హరినాథుఁడు మిక్కిలి సంతసించి,
అతనికి తన సేనలపై నధికారంబిచ్చె.

గరుడసత్త్వుఁడు కొలదికాలములోనే తన తెలివి
తేటలను, ధైర్యసాహసములను బ్రకటించి రాజాదరణమునకు
పాత్రుఁడయ్యె. పోనుపోను అతనికి జెప్పకయే రా జేపనియుఁ
జేయకుండెను. అది చూచి తక్కిన రాజకుమారులు ఖిన్నులై
శత్రుభావమున నుండిరి. దీనికిఁదోడుగా రాజు తన కుమార
వర్గంబును అతనివశంబున మెలంగ నియమించెను. రాజ
పుత్రులకీ కార్యము సహింపరానిదై పోయెను. ఎట్లేని గరుడ
సత్త్వుని నాశనముచేయ వారు సంకల్పించుకొనిరి. అతని
తఱిమివైచుటకుఁగాని చంపుటకుగాని వారికి ధైర్యము లేక
పోయెను. తుదకొక రాజకుమారుఁడు తక్కిన వారితో
నిట్లనియె; "మనము వేఁటకై యనుజ్ఞ తీసికొనిపోయి, గూఢం

లుగ చుట్టుపట్ల నెందేని దాఁగికొందము. మనము మరలి రాకుండుటకు కారణంబరపి రాజు గరుడసత్త్వుని దండించును. చంపివేసినను వేయవచ్చును." తక్కిన వారందఱు ఈ యుపాయంబునకు సమ్మతించి, గరుడసత్త్వుని యొద్దకు బోయి, "అన్నా! మే మీదినంబున వేఁటకుఁ బోయెదము. సంధ్యాసమయంబునకు వత్తుము. సెలవిమ్ము" అనిరి. గరుడసత్త్వుఁడు సమ్మతించెను. వారేగిరి. తిరిగి రారైరి.

మూఁడు దినములు గడచె. పుత్రదర్శనము లేకపోవుటచే రాజు గరుడసత్త్వునిపిలిచి, కుమారులేమైరని యడిగె. వారు వేటకుబోయి అనినప్రకారము తిరిగి రారైరి అని గరుడసత్త్వుఁడు తెలుప రాజు మిక్కిలి కోపించి, "వేగముగాఁ బోయి వారిని వెదకి తెమ్ము. వారు రానిచో నీకు శిరఃఖండనము తప్పదు" అని గర్జించెను.

గరుడసత్త్వుఁడు ధనుర్బాణములను దాల్చి సమీపవనంబులను, పరిసరగ్రామములను అన్వేషింపఁ జొచ్చెను. ఎంత వెదకినను ఎందఱ నడిగినను రాజకుమారకుల జాడ తెలియ రాకుండెను. అతఁడొక యెడారింబడి పోవుచుండఁగా నద్దాని నడుమ నొక దివ్యసుందర మందిర మగపడియె. అతఁడు తల యెత్తి చూడగా ఒకసుందరి యగపడియె. ఆమె మిక్కిలి విషాదపూరితయై యుండె. ఆమె గరుడసత్త్వుని జూచినంతనే "ఓ వీరపురుషా! పొమ్ము తడయక పొమ్ము. ఇచట నడుగు పెట్టకుము. ఈసౌధము మృత్యుముఖము. దీనియధిపతి యొక క్రూరరాక్షసుఁడు. నరమాంసాహారి. అతఁడు వచ్చు వేళ

యైనది. తెలిసి తెలిసి మృత్యువాతఁ బడకుము." అన గరుడ సత్త్వుఁడు "వనితా! నీ వెవ్వరవు! ఇందేల యుంటివి," నావుడు ఆసుందరి "నేను భగవత్పురాధిపతి పుత్త్రికను. అప్పురంబునకుఁ బోవుచుండఁగా నన్నీతఁడు బంధించె. మత్పరిజనంబును సంహరించె. ఆరాక్షసుఁడు నన్నుఁ గాదించి రేపటి వఱకు గడువొసంగె. నాకింక మరణంబే శరణంబు. నీవు శీఘ్రముగ వెడలిపొమ్ము."

అట్లాయువతి పల్కుచుండఁగనే ఆక్రూరరాక్షసుఁడు వచ్చెను. రాక్షస గరుడసత్త్వులకు ఘోరయుద్ధము జరిగెను. గరుడసత్త్వుఁడాతని హస్తమును ఖండించెను. రాక్షసుఁడు కోపోద్దీపితుఁడై ఒంటిచేతితో గద గొని యుద్ధముచేయ మొదలిడెను. అంతలో రాజకుమారుఁడాతని శిరంబు ఖండించె. క్రిందఁబడిన శిరముయొక్క భారముచేత పుడమి యదిరె.

అదియంతయుఁ జూచుచున్న రాజపుత్రిక ఆశ్చర్య సంతోష పరవశయై రాక్షసుని మొలలోనున్న తాళపుచెవి గుత్తిఁగొని తనయొద్దకురమ్మని ప్రార్థించెను. గరుడసత్త్వుఁడు తాళములు తెరచి రాజపుత్రిక యున్నగదిఁ ప్రవేశించి ఆమె బంధములు త్రెంచివైచెను. ఆమె కృతజ్ఞతా సూచకముగా ఆతని పాదములంబడి అనేక భంగుల స్తుతించె. పరస్పరావలోకన మాత్రముచేతనే వారు మోహపరవశు లైపోయిరి.

అంతలో ఒక దీనస్వరము వారికి వినంబడియె. అచటబంధింపబడి యున్నవారిలో నదియొకరి దీనస్వరమని రాజపుత్రిక

తెలిపెను. వారిచ్చురు అద్దీనశబ్దంబు మార్గంబునఁజని, కారా గృహమార్గంబు నిచ్చెనవెంట భూబిలంబులోనికి డిగ్గి రాక్షసుఁడు మ్రింగుటకు వచ్చుచున్నాఁడని భయపడు నాదురదృష్టపాంథుల బంధములు విడిపించెను. వారు సంతోషముచే గంతులిడుచు దైవసంకీర్తనము గావించిరి. అందరును వెలుగులోనికి వచ్చిరి. రాజపుత్రిక గరుడసత్త్వుని సభాభవనమునకు దీసికొనివచ్చి సింహాసనముపై గూర్చుండఁబెట్టి యొక్కొక పాంథునిరావించి పరీక్షింపించుచుండెను. గరుడసత్త్వుని సోదరులందరును అచటనుండిరి. గరుడసత్త్వుని సంతోషమునకు మేర లేకపోయెను.

గరుడసత్త్వుఁడు వెండియు ప్రతిప్రదేశమును అద్భుతంబుగఁ బరిశీలించి అమూల్య రత్నాదులం బొడగాంచి, ఎవని సొత్తునువారు తీసుకొనుఁడని యాజ్ఞాపించె. ఆపాంథులు ఎవరి సొత్తువారు తీసికొనిరి. ఇంకను కొంతమిగులగా తనతమ్ములకు ఇతరులకు భాగించి యిచ్చెను. ఆపాంథులందరు పశుశాలయందున్న తమవాహనాదుల నధిష్ఠించి, గరుడసత్త్వుని దీవించి సంతసించుచు తమతమ పురాభిముఖులై పోయిరి.

అనంతరము గరుడసత్త్వుఁడు రాజపుత్రికంజూచి "భగవత్పురంబునకుఁ బోదలచితివేని, నిన్నుఁ బంపించెదను." అన రాజపుత్రిక యిట్లనియె. "శూరవరా! నా వృత్తాంతము నీకు దెలియదు. భగవత్పురంబున నాకేమియు లేదు. నాతండ్రిని ఒకశత్రువు చంపె. ఆతనికారినుండి తప్పించుకొని వచ్చి ఈరాక్షసునిబారిఁ బడితిని" అనఁగా

రాజపుత్రులందరు "నీవృత్తాంతమును దెలుపుమని కోరిరి. ఆవనిత తనచరిత్రము నిట్లు చెప్పదొడంగెను

"శూరులారా! భగవత్పురంబున కధిపతియైన నా తండ్రి చిరకాలము సంతాన విహీనుండై యుండి తుదకొక పుత్రికను గాంచె. నేనే యారాజపుత్రికను. నాతండ్రి నాకు సకల విద్యలు నేర్పించె. అమ్మహాదేశమునకు నన్ను రాజ్ఞిని గావింప నిశ్చయించె.

ఒకప్పుడు నాతండ్రి వేటకై పోయెను. ఒకవన మహిషంబును తఱుముచు తఱుముచు నిజపరివారంబునకు దూరుఁడయ్యె. రాత్రియైపోయె. ఏమిచేయుటకును దోచక నాతండ్రి నల్దిక్కులు పరికించుసంతిలో దూరమ్మునఁ గొంత వెలుఁగు కన్పడియె. అదియొక గ్రామమునుండి వచ్చు వెల్తురు అని తలచి నాతండ్రి యావెలుఁగు ననుసరించిపోయె.

ఆవెలుఁగు ఒక విజనస్థల కుటీరమునుండి వచ్చుచుండెను. ఆకుటీర మందొక రక్కసి సింహాసనాసీనుండై యుండెను. కాల్చిన యెద్దుమాంసము తినుచు మధ్యమధ్య సురాపానము చేయుచు వినోదించుచుండెను. ఆకుటీరములో నొక వనిత యున్నట్లు నాతండ్రి గ్రహించెను. ఆమె బందీయై యుండెను. ఆమె యడుగులకడ ఒక బాలుఁడు అటు ఇటు దొర్లుచుండెను.

అంతలో నారాక్షసుఁడు ఆహారపానీయంబులు ముగించి లేచి, యావనితను బటిూపించి, "సుందరీ! ఇఁక నేని

నీకట్టుదలనువీడి నాప్రేమను స్వీకరింపుము" అన నావనిత మిక్కిలి కోపించి యాతని దూలనాడెను. ఆరక్కసి యదరిపడి, పురుషులప్రేమ యెట్టిదో నీకు తెలియరాదయ్యె. నీకెట్టి నికృష్టమరణము రానున్నదో చూడుమని, ఎనమచేత నామెను పైకెత్తి కంఠము కోయ నుంకించుచుండె.

అంతలో నాతండ్రి యొక నిశిత బాణంబు నాతని తొమ్మునాటింప నారక్కసి నేలంగూలి గతప్రాణుండయ్యె. అంత నాతండ్రి యాదీనురాలి సమీపించి, ఓదార్పగా ఆమె తన వృత్తాంతము నిటు చెప్పె.

మహానుభావ! ఈసముద్రతటమునఁ గొన్ని కుటుంబములు నివసించుచున్నవి. అక్కరవారి కుటుంబములకు నాపతి యధిపతి. ఈదురాత్ముఁడు నాభర్తయొద్ద నొక యుద్యోగి. ఇతఁడు నన్ను మోహించి, ఒకనాఁడు నేను బిడ్డతో నొంటరిగా నుండఁగా భర్తయొక్క యాజ్ఞయనుమిషతో నన్నీ నీచుఁడు ఇంత దూరంబు తెచ్చి ఇట్లు బాధించుచున్నాఁడు. వాఁడు కామియయ్యునా కనిష్టముగా బ్రవర్తింప సాహసింపఁడయ్యె. తుదకు నన్ను దండింప సాహసించె. అనంతరవృత్తాంతము మీకుఁ దెలియునుగదా!

నాతండ్రి దయార్ద్రుఁడై ఆమెభర్తను వెదకింతుననియు అంతవఱకు తన యింటనుండుమనియుఁ జెప్పెను. ఆమె యంగీకరించి భగవత్పురము ప్రవేశించె. ఆమెనొక వదనంబునుంచి, తత్తనయుని జదివించుచుండె; ఆమె తన మనోనాధుఁడు తనకై యన్వేషణంబుచేయుట లేదని మొదట

విచారించినదిగాని, క్రమక్రమంబున నాతండ్రి చేయు నుప
చారములచే అద్దాని విస్మరించె.

ఆ స్త్రీతనయుఁడు క్రమక్రమముగా యౌవనుఁడై మనో
హరాకారుఁడయ్యె. నాతండ్రి సన్నిచ్చి వివాహముచేసి
యాతనినే రాజును చేయునని ప్రజలందరు విశ్వసించుచుండిరి.
ఆకుమారుఁడును గర్వోద్ధతుఁడై నాతండ్రి తన్నట్లు లాలించు
టకు గతంబెఱుఁగక, తనకు యౌవరాజ్యమునింకను ఒసఁగక
పోవుటచే తెంపుచేసి, ఒకనాఁడు నాతండ్రియొద్దకుఁబోయి
“నీకూఁతు నిచ్చి వివాహముచేయుమని కోరెను. నాతండ్రి తన
యూహలింకను స్థిరపడలేదని తెలిపెను. అకృతఘ్నుఁడు
ఎవ్వరితో నేమియుఁజెప్పక తఱిఁజూచి నాతండ్రిని వధించి
తానే రాజునని ప్రకటించుకొనియె.

ఒకనాఁడతఁడు నాశయనాగారమునకు వచ్చి నిర్బం
ధింపనుండ నాతని తలం పెఱింగిన మాప్రధానామాత్యుఁడు
నన్ను తనమిత్రుని యింటఁ దాచిపెట్టెను. పిదపనొక
ఓడను సిద్ధపఱచెను. మంత్రియు విశ్వాస్యయగు నొక
దాసియు నేనును ఆయోడయం దెక్కితిమి. మిత్రనృపాల
సాహాయ్యముచే నారాజ్యము నాకుదక్కింప వలయునని
యాతని యుద్దేశ్యము. ఆయోడ సముద్రములో ప్రయా
ణించుచు నొకఱాతికిదాఁకి బద్దలై పోయెను. మంత్రియు
దాసియు నేమైపోయిరి నాకుఁదెలియదు. నేనుమాత్రమొక
తీరమును జేరియుంటిని.

ఆస్థితియందు నేను ధైర్యమువీడి ప్రాణత్యాగంబుచేయ సంకల్పించుకొంటిని. అట్టిసమయంబున వెనుకవైపు ఘటాశ్వములకలకలము వినఁబడియె. నేను వెనుదిరిగి చూచునప్పటికి అశ్వికులమధ్య నొక మణికిరీటధారి కానవచ్చె. పగిలిన యోడతెంపులచే నాస్థితిని వారే యూహించుకొనిరి. ఆతని యనుచరులు ఎన్నివిధములఁ బ్రశ్నించినను నేను నిరుత్తరనై యుంటిని. తుదకా మహాపురుషుఁడునన్నుజేరి "ఓసుందరీ! ఆపదలు కాపురములు చేయవు. నీకు విశ్రాంతివలయుచో నాపట్టణంబునకురమ్ము. నాసర్వస్వము నీయధీనము చేసెదను. నీతల్లి వాత్సల్యముచే నీదుఃఖము కొంతశమింపఁగలదు.

నే నారాజకుమారుని ప్రార్థనంబంగీకరించి, గొప్పకులము దాననే యని తెలిపి, నావృత్తాంత మాతనికి విన్నవించితిని. ఆతఁడు నన్నుఁ దీసికొనిపోయి తనతల్లికి అప్పగించెను. నాగతి విని యారాణి దయతో నన్నాదరించుచుండెను. కొంతకాలమునకు మా యిరువురకును వివాహము జరుప నిశ్చయింపఁబడెను. మేము నూతనాలంకారములు ధరించుటలో మునిగిపోతిమి. ఆస్థితియందు ఒకశత్రురాజువచ్చి పురంబు ముట్టడించె. అయత్నస్థితిలోనున్న మాసైన్యము నాశనమయ్యె. ఆతఁడు రాజభవనంబు ప్రవేశింపనుండ మేము గుప్తమార్గమున కోటవీడి, సముద్రతీరముచేరి, ఒకఓడనెక్కి రెండుదినంబులు ప్రయాణించితిమి; మూఁడవనాఁడు ఎదుర మఱియొక యోడ కనుపించెను. అది దొంగలయోడ. ఆదొంగలు మమ్ముఁబట్టుకొని నానాథుని బంధించిరి. నాసౌం

దర్యము చూచివారు సుందోపసుందులవలెఁ బోరాడి ఒకఁడుతప్ప మిగిలిన వారందఱు చచ్చిరి. మిగిలినవాఁడు నన్ను భగవత్పురంబునకుఁ గొంపోయి తనమిత్రునకు కానికగా నిత్తుననియె. నాభర్తను బంధితునిఁజేసి సముద్రములోఁ బాఱవైచెను.

నేనుభీతనై చేయునదిలేక సముద్రములోఁ దూఁకఁ బోతిని. ఆతఁడు నన్నును బంధించి యోడకు అంటగట్టెను. కొంతకాల మాయోడపై ప్రయాణించి తుదకొకనాఁడు ఓడను ఒడ్డుచేర్చెను. మేమిరువురము జనపదమునుబట్టి పోవుచుండఁగా నిన్న నీచే మృతుండైన రక్కసి యెదుర్పడియె. మాయిరువురకును ఘోరయుద్ధము జరిగెను. ఆరక్కసి యాద్దాచే నే నాకళేబరమును మోసికొని యీగృహంబు చొచ్చెను. ఆవాని శవమును రాత్రిభోజనముక్రింద వెచ్చించి, నన్నుబంధించి తన్ను నేను పెండ్లి చేసికొనవలయు ననియు, ఆలోచించుటకు మూన్నాళ్లు గడువిచ్చితిననియుఁ జెప్పి, తెల్లవాఱిన తోడనే పాంథులను పట్టుకొనుటకుఁ బోయెను. వారెవరు దొరకలేమిఁ గాఁబోలు రిక్తహస్తములతో వచ్చి నీచే మడిసెను.

అంతగరుడ సత్యవ్రతుఁడామె నూఱడించి, "మేమందఱము నిన్ను పుష్పములలోఁ బెట్టికొనిపోయి మాతండ్రికడఁ జేర్చెదము. నీవనుమతింపుము. నామనమును నీకర్పించితిని. రెండు వివాహములకు విఘ్నము తటస్థించినది. మూడవసారి ఈపలువురు రాజపుత్రుల యెదుట మునిపడఁగలము. ఇదియేకళ్యాణ భవనము. ఈభవనమునందు మనవివాహమునకే కాఁబోలు

ఎల్లసంభారములు చేర్చియున్నాను." అన రాజపుత్రిక సమ్మతించెను. వారిరువురకు వివాహము యధావిధిగా జరిగెను. ఆదాంబోవు పాంధులకు విందులుచేసి మిగిలిన సరుకులు వెంటఁగొని వింధ్యావళింగూర్చి వారుపయనమైరి. ఇఁక వారు ఒక్కదిన ప్రయాణములో వింధ్యావళి చేరనుండిరి. కుటీరంబులు వేసికొని సంతృప్తిగ భుజించిరి.

భోజనంబులు ముగిసిన యనంతరము గరుడసత్త్వుఁడు రాజపుత్రులంగని "సోదరులారా! ఇంతవఱకు మీకుఁజెప్పక ఒకవిషయమును గోప్యముగా నుంచితిని. నేను గరుడ సత్త్వుఁడను. మీసోదరుడను. మనమందరము హరనాధుని సంతానమె. నా తల్లిమందయాన." అవ్వనితయు గరుడ సత్త్వుని కులగోత్రాదులు విని మిక్కిలి సంతసించెను.

ఆ సంగతి తెలిసినప్పటి నుండియు రాజకుమారులు ఆనందించుటకు మాఱుగా ఈర్ష్యాపరులైరి. ఆ య్యన్నదమ్ములు రహస్యంబుగా నొక్కచోఁజేరి, ఇతని జంపకున్నచో మన భీరుత్వము నగరమునఁ బ్రకటితమగును. ఈతని శౌర్యమునెదుట మనకేమియు గౌరవముండదు. రాజ్యార్హత యుండదు. కావున నిద్రించునపుడు మనము గరుడ సత్త్వుని సంహరింతము." అని నిశ్చయించుకొనిరి. వారానాటి రేయి ఆ సోదరులు నిద్రించు నన్నను పొడిచిపొడిచి చచ్చెనని భావించి బయలుదేరి పోయి మఱునాఁటి యుదయంబున స్వనగరంబు చేరిరి. తండ్రితో దేశాంతర విశేషములు చూచుటకు పోయితిమని బొంకిరి.

తమ్ముల పోటులచే యమయాతన పడుచుండెను. అదృష్టవశమున ప్రాణములు మాత్రము పోలేదు. రాజపుత్రిక బాష్పములతో భర్తమేను తడియఁజేయుచు, మిక్కిలి దుఃఖించుచుండెను. ఆమె కొంతసేపు దైవమును దూఱుచు, కొంతకాలము తన దురదృష్టమును నిందించుకొనుచు, మఱి కొంతసేపు మఱఁదులను తిన్నఁగూడఁ జంపిపోనందులకు అసహ్యించుకొనుచుండెను.

ఇట్లు పెక్కుభంగుల దుఃఖించి వైద్యుని కొఱకు సమీప గ్రామమునకుఁ బోయెను. ఒక వైద్యుని వెంటనిడుకొని కుటీరంబునకుఁ దిరిగివచ్చుసరికిఁ గరుడపక్షి యచట లేకుండెను. రాజపుత్రిక కూలఁబడిపోయెను. వైద్యుఁడామెను బుజ్జగించి "నీవిందుండఁదగదు. ప్రకృతము నాయింటనుండుము" అని ప్రార్థించెను. అప్పటికిఁ జేయునదిలేక ఆమె యొడంబడెను. వైద్యదంపతు లిరువురు ఆమెకు పెక్కు ఉపచారములు గావించిరి. కాని ఆమెకు దుఃఖము తగ్గకుండెను. పైఁగా నానాటికిఁ హెచ్చిపోవుచుండెను. ఆ వైద్యుఁడు మిక్కిలి చింతించి, ఒక్కనాఁడామె వృత్తాంతమంతయుఁ దెలిసికొని, "దేవీ! యడలకుము. వైరులవలని పగఁదీర్చుకొనవలయును, నీవంగీకరించినచో హరనాథుని యాస్థానమునకుఁ బోవుదము." అన నమ్మగువ సమ్మతించె.

వైద్యుఁడును రాజపుత్రికయుఁ గొన్ని క్రోసులదూరమేగి ఒక సత్రములో విడిసిరి. వైద్యుడు సత్రాధికారిని రాజనగర విశేషము లెవ్వియని యడుగ అతఁడిట్లనియె,

"రాజుగారి పెద్దకుమారుఁడు మాఱునామధేయముతో నిట కొంతకాలముండెను. రాజుగారాతని మిక్కిలి ప్రేమించుచుండిరి. అతఁడిప్పు డేమయ్యెనో తెలియకున్నది. అతనితల్లి మందయాన. అతనికొఱకు సర్వప్రయత్నములు చేయుచున్నది. కాని అతఁ డున్నతావు తెలియరాలేదు. పెక్కురు నందను లున్నను రాజుగారు ఏకపుత్రనష్టము వలనఁ గూలిపోయిరి."

అంత వైద్యుఁడు రాజపుత్రికం జూచి, "తల్లీ! నీవు మీయత్తగారగు మందయాన నాశ్రయించి యుండుము. నీవు నగరమునకు వచ్చినది తెలిసినచో తమకుట్ర బయటపడునని భయపడి, నిన్ను రాజభవనము ప్రవేశింపనీయరు. మందయాన సందర్శించుటకు ఉపాయాన్వేషణము చేసివచ్చెను. నీవు అప్రమత్తురాలవై యుండుము." అనిచెప్పి పురము చొచ్చి రాజమార్గమున వింతలు చూచుచుఁ బోవుచుండెను. యువతీజనము పరివేష్టించి యుండఁగా నొక యధికారనారీమణి రాజమార్గంబున వచ్చుచుండెను. ఆమెయే మందయాన యనియు కుమారుని సుభాగమనంబు కోరి దేవాలయమునకుఁ బోవుచున్నదనియు వైద్యుఁడు తెలిసికొనెను.

వైద్యుఁడు రాణిగారి సమీపమునకుఁబోయి, అచటి భటునితో "గరుడసత్త్వుని వృత్తాంతము చెప్పఁగలను. రాణిగారియొద్దకుఁ బోనిమ్ము" అనియె. భటుఁడు రాజమాతనగరు ప్రవేశింపఁగానే వైద్యునివృత్తాంతము తెలిపెను. "అతని వెంటనే తీసికొనిరావలసిన"దని రాణిగారు ఆజ్ఞాపించెను. భటుఁడు వైద్యుని రాణిగారియొద్దఁ బ్రవేశపెట్టెను.

"నాపుత్త్రుని విషయము నీకేమి తెలియును. శీఘ్రముగఁ జెప్పు"మని రాజమహిషి యాజ్ఞాపించెను. వైద్యుఁడు తనకుఁ దెలిసినవృత్తాంతమంతయుఁ జెప్పెను. మందయాన మిక్కిలి శోకించి తగువాహనాదులఁ గొనిపోయి తనకోడలిని శీఘ్రముగాఁ దీసికొని రమ్మనియె.

మందయానదుఃఖమున కంతు లేకుండెను. పుత్త్రుని దలఁచికొని తలఁచికొని పెక్కురీతుల దుఃఖించుచుండెను. అంతలో హరనాథుఁ డటకువచ్చి, సంగతి సందర్భములు తెలిసికొనియె.

రాజంత మిక్కిలి కోపముతో "నీకు పుత్రశోకము కల్గించినవారిని దగినశిక్షకుఁ బాత్రులను జేసెదను" అనుచు వెడలిపోయెను. అతని యాగ్రహాకారంబు గని యెక్కడవా రక్కడ యొదిగికొనుచుండిరి. రాజు మౌనధారియై సింహాసన మధిష్ఠించి, మంత్రులరావించి, ప్రధాన మంత్రితో నిట్లనియె. "నానలువది తొమ్మండ్రుకుమారుల పుత్రులను కారాగారమున బెట్టింపుము." అన వారందరు విస్మయులయ్యు రాజాజ్ఞమీఱలేక వెడలిపోయిరి.

రాజు ఇతరులనుజూచి "మీరు ఒకమాసము దినములు నాతో సంభాషింపకుఁడు. మీమీ కార్యములను తరువాత విచారించెద" అనియె. అంతలో మంత్రి రాజాజ్ఞ నెఱవేర్చి వచ్చెను.

హరనాథుఁడు మంత్రిని వెంటనిడుకొని మందయాన మందిరమునకుఁబోయి, కోడ లెంతున్నదియుఁ దెలిసికొని,

తగుమర్యాదలతో నామెను దీసికొనివచ్చుటకు మంత్రి నాజ్ఞాపించెను. మంత్రియు అతిత్వరితగతి సత్రమునొద్దకుఁ బోయి, రాజపుత్రికను అశ్వారూఢను గావించి రాజమార్గమునఁ దీసికొని వచ్చుచుండెను. రాజవధువునుగాంచి పౌరలోకము సంతోషించెను. వెంటనే రాజపుత్రుని దలఁచుకొని దుఃఖించెను.

రాజగృహము ప్రవేశించిన వెంటనే మామగారామెను చేయిపట్టుకొని మెల్లగదింపెను. వారిరువురును మందయానమందిరము చేరిరి. ఆముువ్వరును దుఃఖసముద్రమున మునిగిపోయిరి. వారిస్థితిని వర్ణింపఁ దరముకాదు.

తుదకు రాజపుత్రిక జరిగిన వృత్తాంతమంతయు నత్తమామల కెరిగించెను. రాజు మిక్కిలి దుఃఖించి తనయులను శిక్షించుటకు మున్నుగ వారలొనరించిన పాపకృత్యమును వెల్లడింపవలసినదని మంత్రి కాజ్ఞాపించెను. పుత్రునిశరీరము దొరకకపోయినను యథావిధిగా పారలౌకిక క్రియలు నిర్వర్తింపఁదలంచి పురమధ్యంబున పాలరాతి మండపంబు సమాధికై నిర్మింపవలయుననియు మంత్రికిఁ జెప్పెను.

ప్రసిద్ధశిల్పులు మండపము నిర్మించిరి అందు గరుడపక్షి ప్రతిరూపంబు చెక్కిరి. అంత భూపతి దినవారక్రియలకు తిథినిర్ణయము చేయించెను. రాజు పరివారముతో నచటికి పాదచారియై వెళ్ళెను. ఆప్రదేశమునందు అశేషజనము క్రిక్కిరిసి యుండెను.

ముందుగా నీలవస్త్రధారులైన తురగారూఢులు మండపమును ప్రదక్షిణించి, తలలువంచి యిట్లనిరి. "రాజకుమార! నీకష్టసమయమున మేముంటిమేని నిన్నుఁ బ్రతికించుకొనియే యుందుము. కాని భగవదాజ్ఞ నెరవేఱవలయును గదా!"

పిదప నూఱుగురు వానప్రస్థులు తెల్లనిగడ్డములు నేల జీరాడుచుండ, బ్రహ్మతేజము ముఖముల నలంకరించుచుండ మండపము సమీపించిరి. రాజగృహంబుల శుభాశుభ కార్యములపట్ల వారువచ్చి ఆశీర్వదించిపోవుట ఆచారము. వారొక్కొక్కరు వేదగ్రంథముల శిరముపై నుంచుకొని, సమాధి మండపమును మూఁడుసారులు ప్రదక్షిణించి నిలిచిరి. వారిలో నొకవృద్ధుఁడు "ఓ రాకుమారా! మాదైవప్రార్థనలచే జీవించి వచ్చితివా. నీ పాదములపై మాదీర్ఘశ్మశ్రువుల నుంచి తుడిచెదము. కాని లోకప్రభువు నిన్ను తనకొఱకు, దీసికొనిపోయెను." అని యుచ్చరించి తొలఁగిరి.

అనంతరము పలువురు కోమలాంగులు రత్నాభరణ భూషితలై వచ్చి సమాధిచుట్టు మువ్మాఱుతిరిగి, అమొగులకడ నిలువంబడి, "ఓ రాజకుమార! మేము నీ కేమి యుపకారము చేయఁగలము. మాప్రార్థనలు నిన్ను బ్రతికించెనేని నీకు దాసురాండ్రమై యుందుము. నీవెవ్వరికిని ఉపకరింపవైతివి. నీకెవ్వరును ఉపకరింపరైరి.

తదుపరి రాజమంత్రులు మొదలగువారు వేచి గరుడసత్త్వని విగ్రహమునకు మువ్మారు ప్రదక్షిణించి నిలిచిరి.

పిమ్మట హరనాథుఁడు లేచి, "ముద్దులపట్టీ!" అని కన్నీటి ప్రవాహముచే మాటలాడ లేకపోయెను. అపుడు మంటపద్వారము మూయఁబడెను. ఎనిమిది దినము లీరీతిని నిత్యవిధు లాచరింపఁబడియె.

అనంతరము రాజకుమారుల శిరచ్ఛేదము చేయుటకు నిర్ణయింపఁబడినది. ఉరికంబములు పాతఁబడియె. సర్వమును సిద్ధమైయుండెను, ఇంతలో దూరమునుండి దుమారము లేచెను. పూర్వవైరులు కష్టసమయమును కనిపెట్టి అధిక సైన్యయుతులై పురమును ముట్టడించిరి. వెనుకటి తిరుగుబాటులలో గరుడసత్త్వుడే వారిని పాఱఁదోలెను. ఇపుడాతఁడు లేఁడుగదా యని విఱ్ఱవీఁగుచుండిరి.

హరనాథుఁడును యుద్ధసన్నద్ధుఁడాయెను. ఆగడబిడలో రాజపుత్రుల మెడమీఁదికత్తి తప్పినది. దైవచిత్రము!

ఇరుసైన్యములును సంకులముగా యుద్ధముచేయుచుండిరి. హరనాథునికోటకై విరోధిసేన తిరిగెను.

హరనాథుని సైన్యము క్షీణించిపోవుచుండెను. అంతలో ఒకదిక్కునుండి మూఁడవసేన వచ్చుచుండెను. ఆసేన వచ్చినదో లేదో వైరివీరులపైఁ బడియె. ఆధాటికి విరోధిసేన ఆగలేక అఱచియుఁ బఱచియుఁ బోయెను.

హరనాథుఁడు ఆ క్రొత్తసేన యురవడి చూచి ఆశ్చర్యసంతోష పరవశుఁడై పోయెను. సేనాధిపతిని జూడ నాతఁడు

-టవిల్యార్చుచుండెను. ఇంతలో సేనాధిపతి ఎదురుగవచ్చి రాజునకు నమస్కరించెను.

ఆవచ్చి నమస్కరించిన వెవరు? గరుడసత్త్వుడే. పాద పదితుఁడైన పుత్రుని శేవన త్తి సారనాథుఁడు, ఎట్లు బ్రతికి వచ్చితివి నాయనా! అని సంతోషముతోఁ బ్రశ్నించెను. భగవదనుగ్రహముచే నీకు సాయపడవచ్చితి నని గరుడ సత్త్వుఁడు పలికెను. "పుత్రా! నీతిమ్ములుచేసిన పాపకార్యమంతయు నాకుఁ దెలియవచ్చినది. భగవత్స్వర రాజకుమారి సర్వవృత్తాంతమును మాకుఁ దెలిపినది." అనెను.

గరుడసత్త్వుఁడంత తల్లిమందిరమునకు బయల్వెడలె. ఆ తక్కోడంగ్రమన్న యెడకు తండ్రికొమరులు వచ్చిరి. తల్లికొడుకులు ఒకరి నొకరు కౌగలించుకొనిరి. ఒకరినొకరు ఊరడించుకొనినపిదప రాజపుత్రిక "నాథా, వైద్యుని తీసుకొని వచ్చుటలో పలవిూ రేమైతిరి!" అని ప్రశ్నించెను.

గరుఁడసత్త్వుఁ డిట్లుచెప్పఁ దొడంగె, "సాధ్వీ! నేనా డలు తెలియక యట్లుపడియుంటినిగదా! అపుడు ఒకకృషీవలుఁడట బోవుచు నన్నాస్థితియందుఁ జూచి దయామయుఁడై తనగృహంబునకుఁ దీసికొనిపోయి నాగాయములు మాన్పెను. నాకు కొంచెము దార్ఢ్యము కలుగఁ జొచ్చెను. నారత్నహారమును దీసి కాపునకు కానుకగా నొసంగితిని. నేనిటకు వచ్చుటకు ప్రయత్నింపఁగా కృషీవలుఁడు రానీయఁడయ్యె.

పిమ్మట నాతని నొప్పించి పురమునకు వచ్చుచుండఁగా మార్గస్థులు వైరిసేన నగరమును ముట్టడించెనని తెలియ

పరచిరి. కర్షకుని చుట్టపక్కములను పోగుచేసి ఈసైన్యమును సముకూర్చుకొని సమయమునకుఁ రాఁగల్గితిని.

గరుడసత్త్వుని వృత్తాంతమువిని అందఱును ఆశ్చర్య సంతోష పరవశులైరి. రాజు కాపునకు పెక్కుభూము లొసంగి, కుమారునితో వచ్చిన సేనను తనమూలబలములోఁ జేర్చికొనియె.

ఆసంతోష సమయమున పురమంతయు దైవప్రార్థనలు జరిగెను. గరుడసత్త్వుఁడాసమయమున తనతమ్ములను క్షమింపు వలయునని తండ్రినికోరెను. కుమారుని యౌదార్యమునకు తండ్రిసమ్మతించెను. పిదప పౌరులను రావించి గరుడసత్త్వుని వృత్తాంతమంతయు వారికెఱుక పఱిచెను.

పౌరులను కుమారులను క్షమింప వలయుననియే కోరిరి. గరుడసత్త్వుని యువరాజును చేయ వేడిరి. పిదపగరుడసత్త్వుఁడు తమ్ములను బిలిపించి పెక్కునీతు లుపదేశించెను. పిమ్మట వైద్యరాజునకు పెక్కుబహుమతు లొసంగి యౌవరాజ్య పట్టాభిషేకము చూచి పొమ్మని ప్రార్థించెను.

పారనాథుఁడు పుత్త్రుల శిక్షలను దొలఁగించి సమస్త బంధుమిత్త్ర సమక్షమున పెద్దకొడుకునకు తన తమ్ముఁడగు శ్యామసుందరునిచే అభిషేకము చేయించెను.

# చంద్రహాసోపాఖ్యానము

కేరళదేశరాజునకు ఒక కుమారు డుద్భవించెను. కొన్ని దినంబుల కారాజు వైరుల నెదిర్చి గండదోషమున మరణించె. భార్య సహగమనముచేసె. దాదులు ఆరాజబాలకుని కుంతల దేశమునకుఁ దెచ్చి, మూఁడువర్షములు పోషించి, మరణించిరి. పురస్త్రీలు ఆదిక్కులేని బాలుని పోషించుచుండిరి.

ఆ బాలుఁడిట్లు పెరుగుచు ఒకనాఁడు మంత్రియగు దుష్టబుద్ధియింటికిఁ బోయెను. ఆ మంత్రి కొలువులోనున్న మహామును లా బాలునిజూచి, ఇతఁడు సకలక్ష్మామండల మేలు రేఖగలవాఁడ'ని వచించిరి. దుష్టబుద్ధి యామునులను సద్వినయమునఁ బంపివేసెను.

దుష్టబుద్ధి యాబాలుని దండింపఁదలఁచి, చండాల భటులను బిలిచి ఆ బాలుని జంపిరండని పంపెను. వా రా బాలుని అరణ్యమునకు దీసికొనిపోయి చంపఁ జేతులురాక కుడికాలు బ్రాటనవ్రేలిని మాత్రము కోసికొని తీసికొనిపోయి మంత్రికిఁజూపి బాలుని జంపితిమని చెప్పిరి. మునులవాక్యములు దబ్బర సేసితినిగదాయని మంత్రి సంతసించె.

అచటి బాలకుఁడు బాధచే దుఃఖించుచుండ పక్ష్యాదులు ఉపచారములు చేయుచుండెను. ఆయరణ్యమునకు దుష్టబుద్ధికి విధేయుఁడగు కుళిందకుఁడను శాబరదేశపురాజు వేఁటకువచ్చి ఆ బాలకునిచూచెను.

రాజలక్షణములచే నొప్పుచు నంగుళివేదనంజేసి వాపోవుచున్న యాబాలుని జూచినంతనే కుళిందకుఁడు దయ గలవాఁడై యాబాలుని బుజ్జగించెను. "నాకు బిడ్డలు లేరుగాన శ్రీహరి యీ బాలుని దయసేసె"నని మనంబున సంతసించుచు స్వయంప్రాప్తుఁడగు సుతుఁడని తలంచుచు, ఆబాలుని దీసికొని తన పట్టణమగు చందనావతి కరిగెను.

తోడ్తోఁ నాబాలుని తన భార్యయగు మేధావిని కొసఁగెను. చంద్రుని నవ్వు హాసంబు గలవాఁడగుటంజేసియాబాలునకు చంద్రహాసుఁడను పేరు క్రొత్త తల్లిదండ్రులు పెట్టుకొనిరి. చంద్రహాసుఁడును విదియ చంద్రునిగతి నభివృద్ధి నందుచుండె. జనులందఱు ఆనందభరితాత్ములై యుండిరి.

తదనంతరము కుళిందకుఁడు చంద్రహాసునకు ఉపనయనము గావించి విద్యలును, విలువిద్యయు నేర్పి, శాస్త్రి ధురంధరుఁ గావించెను. చంద్రహాసుఁడును రుక్మాంగద ప్రభువు చందమునఁ బ్రజలనెల్ల విష్ణుమార్గాచరణ తత్పరులఁ గావించిపోచెను. అంతఁ దండ్రిపంపునఁ బదునాఱేఁడుల వయస్సుగల చంద్రహాసుఁడు దిగ్విజయముగావించి అనేక సంపదలు దెచ్చెను.

చంద్రహాసుఁడు విక్రమార్జిత సంపదలు నగరు క్రిక్కిఱియించి తల్లిదండ్రులకు మ్రొక్కెను. తండ్రియు రాజభక్తి యతిశయింపఁ దనయేలికయగు కుంతలునకు మంత్రియగు దుష్టబుద్ధికి, పురోహితుఁడగు గాలవునకు గణుంగడు ద్రవ్యము వేర్వేఱఁ బంపెను.

వెంటనే దుష్టబుద్ధి రాజునొద్దకుఁ బోయి చంద్ర హాసుని పత్రికఁజూపి దుర్బోధచేసి, కుళిందకునిబట్ట రాజుచే ననుమతుఁడయ్యె.

దుష్టబుద్ధి పెద్దసేన తీసికొని చందనావతీపురముచేరెను. అచ్చటి విశేషములను జూచి యాశ్చర్యపడుచుండెను. ఇంతలోఁ గుళిందకుఁడు చంద్రహాసునితో వచ్చి దుష్టబుద్ధికి నమస్కరించెను. అనేకమనోజ్ఞ వస్తువులచేఁ బూజించెను. దుష్టబుద్ధి కపటప్రీతితోఁ జంద్రహాసుఁడు ఎట్లు లభించి నదియుఁ దెలుపుమని కుళిందకునడిగె. కుళిందకుఁడు అతని వృత్తాంతమంతయుఁ జెప్పె.

దుష్టబుద్ధియంతయు గ్రహించెను. తానుబంపిన చండాలురు తన్ను మోసగించి బాలునిఁ జంపక విడిచిరని గ్రహించెను. అచటఁ చంద్రహాసు నేమిచేయుటకు వీలు గాదని గ్రహించెను. ఇపుడు వీనిని గుంతలదేశమున కనిపి మత్కుమారునిచే విషనిహతుఁ గావింతువని తలంచి, ఒక పత్రిక వ్రాసి, ముద్రవేసి చంద్రహాసునితో నిట్లనియె. "ఈపత్రికఁ దీసికొని నాపుత్రునకిమ్ము. నీ వొక్కఁడవే యేగవలయును. అట నీకు శుభంబగును."

చంద్రహాసుఁ డంగీకరించి, వేగాశ్వము నెక్కి, త్వరలో గుంతలముచేరి యటనొక యుద్యానవనమునందలి సరస్సున నీరుద్రావి, గుఱ్ఱమునకు నీరుపెట్టి కట్టివేసి తానొక తాళితిన్ని చూపైఁ బరుండి నిద్రించె.

ఆసమయమునఁ గుంతలేశ్వరుని కూఁతురు చంపక మాలినియు, మంత్రికూఁతురు విషయయు సఖీసహితలై మన్మథపూజకై యాయుద్యానవనమునకు వచ్చిరి. కొంతవడి వారు వనమంజరులు సరసి సరసిజములు గోసిరి. అందఱును మన్మథపూజ చేయుచుండిరి. విషయ తిన్నియపై నిద్రించు చంద్రహాసుని జూచె. ఆతనిదగ్గఱకు చప్పుడుచేయక మెల్లగ వెళ్ళెను. సంచియందలి పత్రికను జూచెను. తీసిచూచి తండ్రి కపటంపువ్రాఁతకుఁ బరితపించెను. అందాతనికి విష మొసఁగుమని వ్రాసియుండ, విషయనొసఁగుమనుచు దిద్ది, పోలేకపోలేక యింటికిఁ బోయెను.

కొంతవడికి చంద్రహాసుఁడు మేల్కాంచి, కొలనిజల మున ముఖము గడిగికొని, నగరముఁ బ్రవేశించి దుష్టబుద్ధి గృహమునకేగెను. పరిహారి యవ్వార్త కొలువున్న మద నున కెఱింగించె. మదనుఁడు ససంభ్రముఁడగుచు వచ్చి చంద్ర హాసుని కౌఁగిలించుకొని, తండ్రి పత్రికచూచెను.

అందు "ఈపత్రిక వీక్షించినంతనే యీతనికి విషయ నొసఁగు" మని యుండె. మదనుఁడు సంతసించి యా రాత్రియే విషయాచంద్రహాసులకు మహేంద్ర వైభవముగా వివాహ మొనరించెను.

చందనావతీపురంబున దుష్టబుద్ధి "ఈపాటికి చంద్ర హాసుఁడు కుంతలమును జేరియుండును. నా యత్నము ఫలిం చియే యుండును అని నిశ్చయించుకొని కుళిందకుని చెఱ గొని, దుర్గమును గొల్లకొట్టి, బంగారు పల్లకియెక్కి ప్రయా

గించుచుండెను. కుంతలము సమీపమున ఒక గొప్ప సర్ప
మెదురుపడి "నేనీనగరంబులోని నిక్షేపములను ఇంతదనుక
రక్షించితిని. ఇకఁ బోయెద" నని వెడలిపోయె.

దుష్టబుద్ధి కుంతలముఁ బ్రవేశించి నగరి వైభవముఁజూచి
చంద్రహాసునకును మదనకును వివాహము జరిగియుండునని
యూహించెను. వెంటనే మదనుని బిలిచి 'నేనేమి చెప్పిన
నీవేమి చేసితి' వనెను. మదనుఁడు పత్రికఁ జూపెను. దుష్ట
బుద్ధి యత్యాశ్చర్యపడెను. ప్రాణమిచ్చి ఈవివాహము నీయాజ్ఞ
చొప్పున జరుపుటకు ప్రయత్నించితినని మదనుఁడు పల్కెను.

ఇంతలో [illegible] అల్లుఁడు మామకు నమస్కరింప
వచ్చిరి. దుష్టబుద్ధి కపటలాలనము చేయుచు నాల్గవదినమున
వారికి శోభనము చేసెను. మఱుసటినాఁటి వేకువన దుష్ట
బుద్ధి "చంద్రహాసుని జంపి, మునులపల్కులు బొంకుచేసెద"
వని నిశ్చయించుకొనెను.

అంతట దుష్టబుద్ధి హింసాపరులైన చండాలురఁబిలిచి
"మీరు వెలుపలికోటలోని కాళికాభవనమునం దుండుఁడు.
సంధ్యాసమయంబున నటకు ఒంటిగా వచ్చిన వానిని తుండె
ములు చేయుఁడు. అట్లు చేసినచో మీకర్ధరాజ్యమిత్తును"
అనియె.

ఆవేళ దుష్టబుద్ధి చంద్రహాసునిబిలిచి, "ఆచారము
ననుసరించి, నీవీ సాయంసమయమున దుర్గాపూజ చేయ
వలయు" ననెను. చంద్రహాసుం డంగీకరించెను.

ఇది ఇట్లుండఁ గుంతలదేశాధీశ్వరుఁడు పురోహితుఁడగు గాలవుని బిలిపించి "రాజ్యకాంక్ష తీరినది. తనువు నీడకు శిరస్సు కానరాకున్నది. నాకు అరిష్టలక్షణములు తెల్పుము" అనియె.

అంత గాలవుఁడు దత్తాత్రేయుఁడు అలర్కునకుఁ జెప్పిన యరిష్టలక్షణములు రాజున కిట్లెఱింగించె. "రాజా! ధ్రువాది నక్షత్రములఁ జూడఁజాలనివాఁడు సంవత్సరములో మరణించును. కిరణములతోడి యగ్నిని, కిరణములు లేని సూర్యుని జూచినవాఁడు పదునొకండు నెలలలో మృతియగును. నిర్నిమిత్తముగ బలిసినను జిక్కినను ఎనిమిది నెలలకుఁ జచ్చును. వ్రేళ్ళు మొదలగునవి ఖండితములైనవాఁడు ఏడు నెలలకుఁ జచ్చును. కాకిలోనగునవి నెత్తిసోకినవాఁడు ఆఱు నెలలకు మరణించును. స్నానాదులఁ దుమ్మును గురువాఁడు అయిదు నెలలకు మరణించును. తననీడ వేరుగానుండువాఁడు నాల్గు నెలలకు, మేఘము లేని మెఱుపును దక్షిణదిక్కునఁ జూచువాఁడు ముమ్మాసములకుఁ జనిపోవును. స్నానమొనర్చునపుడు అవయవములకంటె మున్ను హృదయమధ్యము జప్పపి పొందినవాఁడును, నీరు త్రాగినను దాహమాఱనివాఁడును, పదిదినములలో చని పోవును. కంటిపాపలోఁ దనరూపము కానకున్నను, చెవులలో వ్రేళ్ళు పెట్టినపుడు శబ్దము విననివాఁడును తప్పక చచ్చును. క్రోఁతి మొదలగువాని నెక్కి యమపురికేగునట్లును, తనశిరస్సున గ్రద్దలులోనగునవి భక్షించుచుండునట్లును, దిగంబరుఁడైన సన్యాసి నవ్వుచు గంతులు వేయునట్లును,

ఆపాదమస్తకము తైలముగల్గి నిద్రించునట్లు, అస్త్రశస్త్రములు రాలయువిడ్చినట్లును, నీలిచీరకాంతి దక్షిణము పోవునట్లును, స్వప్నమందుఁ జూచువారు తప్పక చత్తురు."

కావున "రాజా!' నీవు శాంతినొందెగ్గి, సర్వసంగపరిత్యాగముచేయుము" అని గాలవముని చెప్పె. రాజు రాజ్యము వీడఁదలఁచి; మదనునిఁబిలిచి, "చంద్రహాసుని బిలువుము. చంపకమాలినాతనికిచ్చి పంక్తిచేయుము" ననెను.

మంత్రియాజ్ఞచే కాళికాస్థానమునకుఁ బోవుచున్న చంద్రహాసునిజూచి మదను శీఘ్రమయి, "నిజ మామగా నీపని నేను జేయుదును. కుంతలనాథుఁడు నిన్నుఁబిల్చె" నని చంద్రహాసుని చేతిలోని గంధపుష్పాదులు తాను దీసికొని, తన గుఱ్ఱమును చంద్రహాసునకిచ్చి రాజుకొద్దకుఁబంపె.

అట్లువచ్చి నమస్కరించి నిలిచియున్న చంద్రహాసునకుఁ జంపకమాలిని నిచ్చి వివాహ మొనరించి, అల్లునకు రాజ్యమెల్లనిచ్చి, కుంతలేశ్వరుఁడు తాఁదపోవనమునకేగెను.

అటమదనుఁడు కాళికాలయమున కేగఁగా హంతకులు వానిపైఁబడివధించిరి.

రాజైన చంద్రహాసుఁడు పరివారసమేతంబుగ వేదండంబునెక్కి దుష్టబుద్ధియొద్దకువచ్చి నమస్కరించెను. చంద్రహాసుఁడు మామతోఁ దనవృత్తాంతంబును మదనుఁడు కాళికాసదనమునకుఁ బోవుటయు నెఱింగించె. దుష్టబుద్ధి కళవళంబు లేక యల్లునిపంపి, కాళికాసదనమునకుఁ దలయుఁ

గోకయు వీడగా శీఘ్రముగాఁ బరుగెత్తె. అంతఁ జచ్చిన కుమారుని జూచి తానును బలిపీఠమునందు శిరస్సు గొట్టుకొని చనిపోయెను.

పూజారి చనుదెంచి, యట్లుపడియున్న మంత్రిని తత్సుతునిజూచి, వేగముగాఁజని యవ్వార్త చంద్రహాసున కెఱిఁగించె. చంద్రహాసుఁడు దుఃఖముతోఁ గాళికాసదనమున కేగి వీరలఁబ్రతికింపకుండినచో ప్రజలవలన నాడికవచ్చునని తలంచి, హోమకుండములు త్రవ్వించి తనమేని కండలుకోసి అర్పించెను.

తుదకుఁదన శిరస్సుకోసి పూర్ణాహుతిగా నీయనుండ వైష్ణవి ప్రత్యక్షమై, చంద్రహాసునకుఁ గుమారులు గల్గునట్లు వరమిచ్చి, జ్ఞానోపదేశముచేసి అంతర్ధానముచెందె. తోత్తో దుష్టబుద్ధియు మదనుఁడును బ్రతికిరి.

వారలనుదీసికొని చంద్రహాసుఁడు పురమునకువచ్చి తల్లిదండ్రులకు నమస్కరించె. చంద్రహాసుఁడు హరిభక్తి పరాయణుఁడై పెక్కువర్షములు రాజ్యమేలెను. చంపక మాలినీవిషయులందాతనికి పద్మాక్షమకరధ్వజులను బుత్రులుద్భవించి సుఖంబుండిరి.

# భేదోపాయము

శ్రీకృష్ణదేవరాయలు పొట్నూరిసింహాద్రికి చతురంగబలసమేతముగా చనుదెంచి మహావైభవముగా పాళెమును వేయించెను.

అందు ఎఱ్ఱకలువల కాంతిని మించునట్టి యెఱ్ఱనిపట్టుబట్టలచే నొప్పు గుడారములును మంచి బంగారుపనిచేసినపుడు మెరయుచు తళతళలాడుచున్నవియును తెల్లనిపట్టుబట్టలచే నొప్పు గుడారములును, చిగురుటాకులయందమును హసించునట్టివియు వివిధములైన రత్నములచే ఖచితములును అగు గుడారములను; అమూల్యములైన పచ్చరాళ్ళకొక్క పచ్చని కాంతిచే నొప్పు పచ్చడాలును నగిషీపనియు గలగుడారములును ? హురుమంజపట్టణపు ముత్యాలకూర్పు కాంతిచే నొప్పు పగడములు గల గుడారములును ; కలిగి అతిశయించుచున్న శ్రీకృష్ణదేవరాయల పాళెమును గజరాజు చూచి మిక్కిలి భయపడెను. అతఁడు ఇట్లు అనికొనియెను. రాయల సేనను చూచితిని. ఏమియేనుగులు! ఎట్టిగుఱ్ఱములు; ఎంతటి సామంతులు! ఆ! ఏమి ఆరాజకుమారుల ధీరత్వము!" అని యచ్చెరువుపడుచు కృష్ణరాయలతో యుద్ధముచేయుట తన తరము కాదని నిర్ణయించుకొనియెను.

తన నిర్ణయమును గజరాజు ఆప్తులతో వచించెను. కాని పదార్గురు పాత్రులు కలుగగా భయపడుట అనవసర

మని చెప్పిరి. గజపతియంత ధైర్యము చెంది, పాత్రులను పిలువఁ తినమంత్రులను బంపెను. వారందఱువచ్చి రాజుచే సత్కరింపఁబడి కూర్చుండిరి. వారితో గజపతి యిట్లనియె; "వింటిరా కృష్ణరాయలు అట తురుష్కులను జయించి, ఇపుడు మనసీమకు వచ్చినాఁడు. ఇఁకకర్తవ్యమేమియో తెలుపుఁడు. మున్ను పెదగజపతిరాజు రామేశ్వరయాత్రకు పోవునపుడు ఆతనివెంటఁ జనినతురకలు ఏవో కొన్నివింత పనులుచేసిరఁట ;అదివారిమనస్సులయం దెక్కియుండవలయు. అదియుగాక, ఎల్లలయందు వారిగ్రామములును మనగ్రామములును కలిసిపోయినవని తెలియవచ్చుచున్నది. వారిగ్రామములను స్వీకరించుటకే వచ్చియుండనోపు. కృష్ణరాయలు సామాన్యుఁడు కాఁడు; విజయశీలుఁడగు విష్ణుమూర్తి. ఆతని జయింపదఁగిన యుపాయమును శీఘ్రముగా నాలోచింపుఁడు." అనవిని "కృష్ణరాయలు వచ్చిననేమి? దేవేంద్రుఁడు వచ్చిననేమి? మనకు భయమేల?" యని బలభద్ర తక్కినపదు నేవురు పాత్రులును అచటివీరలోకమును అట్లే ప్రతాప వాక్యము లాడిరి. "ఇట్టిపట్ల కార్యభారము నెట్లునిర్వహింతురో" యనుచు గజపతి వారలను సత్కరించెను. వారును సమరోత్సాహముతో వెడలిపోయిరి.

పాత్రులు మొదలగువారి యుద్ధసన్నాహవార్తవిని రాయలు "పదార్గురుపాత్రుల సాహాయ్యముతో గజపతి పదు నాల్గు భువనములు గెలువఁగలఁడు. ఆతనిజయింప సాధ్యము కాదు. తిమ్మరుసుమంత్రిమాట వినక ఇపుడు ఇచటికివల

వచ్చితివి" అని యాలోచించుచు ఆరాత్రి పాళెములోని వీరు లును ఉత్సాహరహితులై యుండుటయు గమనించి, తిమ్మ రుసును పిలువఁబంచి అయ్యుదంతమంతయుఁ దెలిపెను. అపుడప్పాజి యిట్లనియె. "నామాట వినక ఇచటికి వచ్చితివి గదా! ఇపుడేమి సేయఁగలారము" అన రాయలు ఇట్లనియె; "నీమాట వినకపోవుటచేతనే ఇపుడిచటికివచ్చి చిక్కుపడితిని. సూక్ష్మమతీ! ఇపుడే దేనియుక్తినిబన్ని ఈచిక్కువిడఁదీయుము. నీవు నిజముగా పూనినచో నీకిదియొక లెక్కలోనిది కాదు." అన నమ్మంత్రి యిట్లనియె. "ఇపుడు పాత్రులను విడఁదీయు టకు భేదోపాయముతప్ప మతేమియు లేదు. శౌర్యధైర్యముల వలనఁ బ్రయోజనము లేదు. ధనమణి దుకూలాది వస్త్రములచే లోఁబడని వారెవరును ఉండరుగదా!" అనఁగా "బాధ్యత సమంతయు నీయధీనము చేసితిని. నీయిష్టమెట్లో యట్లు కానిమ్ము." అని రాయలుపలికి, అంతఃపురమునకుఁబోయి సుఖముండె.

అంత తిమ్మరుసుమహామంత్రి భేదోపాయమునకుఁ దగిన యుక్తిని బన్నెను. రాయలపేర ఆపాత్రులకు స్పష్టపడు నట్లుగా, దినసరులు వ్రాయించి, రాయలు ధరించు ఆభరణ వస్త్రములతోఁ బాటు వీనిని మందసమందుంచి. భటులకిచ్చి పంపెను. దుర్గములో వారలను గజపతి గూఢచారులు కనుఁ గొని, తీసికొనిపోయి రాజుముందర నుంచిరి. అంత గజపతి మందసమునఁగల యుత్తరము నిట్లు చదివె.

"శ్రీకృష్ణదేవరాయలు పదునార్గురు పాత్రులకుఁ బంపిన లేఖలు. పూర్వము గజపతిరాష్ట్ర దుర్గములయందు మీతో పలికినవిశేషములు నేర్పుగా వ్రాసితిరి. మీరు కోరిన ప్రకారము ఆభరణములు పంపినారము. రేపటియుద్ధమున గజపతిని మాకుఁ బట్టియిచ్చితిరేని మేము మీకేమియు కొఱఁతి కలుగనీయము."

గజపతి యావార్తను కనుఁగొని ఎట్టివారినైన నమ్మినఁ మోసపోవుటకే యని నిశ్చయించుకొని, సత్వరముగ తత్పురమువిడిచి వెడలిపోయెను. మఱునాఁ డాకథవిని "వీర లేని పోటుగలదే" అని తలఁచుచు వారును ఎందే నరిగిరి.

అవ్వార్త లాలించి రాయలు త్రిలోకాధిపత్యమబ్బినట్లు సంతసించి, అచట నొక జయస్తంభమును నాటించెను. చతురంగబలసమేతముగా నప్పురము ప్రవేశించెను. గజరాజ రాజభవనము రాయలకు తన సేనలు పోకుండునట్లు కట్టుదిట్టములుచేసి తాను నొక యుక్తప్రదేశమున నివసించెను

# సిద్ధార్థుఁడు

హిమాలయపర్వత దక్షిణప్రాంతమున రోహిణి అను చిన్ననది గలదు. ఆ నదికి ఉత్తరమైపున నుండు శాక్యనాయకుఁడు శుద్ధోదనుఁడు కపిలవస్తుపురము రాజధానిగా పరిపాలించుచుండెను. ఆనదికి దక్షిణదిక్కునఁగల కోలీరాజపుత్రికలగు మాయాదేవియు ప్రజావతియు శుద్ధోదనుని పెండ్లియాడిరి. ఆ రాజునకు చిరకాలము సంతానము కలుగదయ్యె. మాయాదేవి 45 సం. ల ఈడుగలదైనప్పుడు ఒక నాటిరేయి ఆమె యూర్ధ్వలోకమునకు కొంపోబడినట్లును, తెల్లని యేనుఁగా మె గర్భమున ప్రవేశించినట్లును ఒక కల గనెను. ఆస్వప్నఫలితముగా ఆమె గర్భమున ఒక మహా చక్రవర్తియో లేక లోకసంరక్షణము చేయు మహాబుద్ధుడో పుట్టునని స్వప్నవేత్తలైన బ్రాహ్మణులు వచించిరి.

మాసములు నిండిన తర్వాత మాయాదేవి ప్రసవము నిమిత్తము పుట్టినింటికి బయలుదేఱెను. త్రోవలో లంబినీ వనమను నొక యరణ్యముండెను. శుద్ధోదనుఁడు నిండు చూలాలగు తన భార్యకు ప్రయాసము కలుగకుండుటకై అరణ్యమునందలి త్రోవనంతయు సరిచేయించెను. దారి కిరు ప్రక్కల పచ్చని తోరణములు కట్టించెను. ఆమె వెనుక సంస్థానమునందలి ప్రధాన పురుషులను పోవఁబంచెను. ఆరీతిగా మాయాదేవి లంబినీవనమున ప్రయాణము సాగించు

చుండెను. త్రోవలో ఒక సరోవర ముండెను. అందమైన
అయిన తామర పువ్వులు తమంతతాము విడివడి ఆమె
వైపునకు వచ్చెను. మాయాదేవి తన చెల్లెలగు ప్రజావతితో
రథముపై గూర్చుండి, ఎఱ్ఱని ఆకులతోడను, చక్కని పూల
తోడను కనుల పండువు చేయుచున్న యొక వృక్షముంజూచి,
దానియొద్దకు తన్నుఁ గొంపొమ్మని కోరెను.

అంత రథమా వృక్షముకడకుఁ గొంపోఁబడెను. ఆమె
ఒక లేఁగొమ్మను బట్టుకొని విఱువఁదలంచెను. కొమ్మ
లన్నియు మమ్ము గ్రహింపుమని వేడికొనునట్లుల క్రిందికి వంగి
నవి. ఆ మాయాదేవి వనసౌందర్యమును జూచుచుండెను.
అపుడామెకు నొప్పులు ప్రారంభమయ్యె. తత్క్షణమె ఆమె
చుట్టును తెరలు గట్టిరి. కొంతసేపటి కామె మగశిశువును
గనియె.

శిశువుకల్గినంతనే నలువురు బ్రాహ్మణులు ఆ బిడ్డను
బంగరువలలో వైచి "దేవీ! నీ గర్భఫలమిదిగో" అని చూపి
రట. ఇఁక నపుడు పుట్టిన వింతలకు అంతులేకుండెను. అతఁడు
మాయాదేవిగర్భమును ప్రవేశించినపుడుకూడ పెక్కు
వింతలు జరిగినట్లు వర్ణింపఁబడెను. పూర్వకాలమున నిట్టి
యద్భుతములు విశ్వసించుట జనసామాన్యమునకు సహజమై
యుండెడివి. కృష్ణ వామనావతారాది ఘట్టములు బ్రహ్మాది
స్తవములతో దేవతాదుందుభినాదముతో, కుసుమవర్ష
ములు కురియుటతో భాగవతమున ప్రారంభింపఁబడుట
మనకు తెలియును. అందుచే సిద్ధార్థచరిత్రమును వ్రాసిన

శక్తులుకూడ తమ నాయకునికి పురాణేతిహాసముల సంప్ర దాయము ననుసరించి పెక్కుమహిమ లంటఁగట్టిరి.

సిద్ధార్థుఁడు మాయాదేవిగర్భము ప్రవేశింపగనే గ్రుడ్డివారు, చెవిటివారు, కుంటివారు చక్కబడిరట. అతఁడు గర్భములోనుండియే పద్మాసనము వేసికొని కూర్చుండి దేవతలకు బోధించుచుండెనఁట.

ఇఁక అతని జననసమయమునఁ బుట్టినవింతలు వర్ణింపరానివి. జన్మించిన వెంటనే ఆశిశువు నేలపై నిలఁబడి తూరుపు దెస చూచెనట. అపు డాతనికి వేయిలోకంబు లగపడెనఁట. ఆలోకములయందలి దివ్యులు మహాపురుషుఁ డవతరించెనని పలికిరఁట. అనంతరము బుద్ధుఁడు మూఁడు దెసలను, ఆకాశమును నేలనుజూచి ఎందును తనకు సమానుని గాంచక పోయెను. అపు డాతఁడు ఏడడుగులదూరము గంతువైచి నిలిచి "నాకిఁక పునర్జన్మము లేదు. ఎల్లభూతములకంటె నేనధికుఁడ"నని నేలపై నడువసాగెనట.

జగంబులందు కనఁబడుచున్న మహాద్భుతంబులఁగాంచి హిమాలయ పర్వతములందు తపస్సు చేసికొనుచున్న యొక మహర్షి ఒక మహాత్ముఁ డవతరించియుండునని భావించి వెదకికొనుచు సిద్ధార్థునియొద్దకు వచ్చెను. శుద్ధోదనుఁడు బాలుని ఆమహర్షి పాదములపైఁ బడవైచి దీవనలందవలయునని తలంచుచుండగా బాలునిపాదము లవిలేచి మహర్షిశిరముపై నిల్చెను. అందఱు అక్కజపడిరి. అమ్మహర్షియు

"ఈ బాలుఁడు బుద్ధుఁడగును. ఈతనిబోధనలు వినునంత వఱకు నేను జీవింపనుగదా" అని వగచెను.

శిశువుపుట్టిన అయిదవనాఁడు నామకరణము చేయింప దలఁచి శుద్ధోదనుఁడు వేదవేత్తలైన నూటఎనమండ్రుగురు బ్రాహ్మణులను రావించెను. అందు జ్యోతిశ్శాస్త్ర ప్రవీణులైన ఏడ్గురు బ్రాహ్మణులు లేచి, "ఇతఁడు భూమండలమంతయు నేలు చక్రవర్తియైన నగును; లేదా లోకమును రక్షించు బుద్ధుఁడైన" నగునని చెప్పిరి. కౌండిన్యుఁడను మఱియొక గొప్ప విద్వాంసుఁడు లేచి, "ఆ బాలుఁడు నిశ్చయముగా బుద్ధుఁడై జగంబులనుండి పాపములు రూపుమాపు" నని చెప్పెను. అంత బ్రాహ్మణు లాతనికి సిద్ధార్థుఁడను పేరు పెట్టిరి.

ఆతఁడు గౌతమగోత్రమునందుఁ బుట్టుటచే గౌతముఁడనియు వ్యవహరింపఁ బడుచుండెను. ఆతఁడు జీవన్ముక్తుఁడైన పిదప బుద్ధుఁడను పేరు కలిగెను. భక్తులు వారివారి భక్తినిఁబట్టి సర్వజ్ఞుఁడు-సుగతుఁడు ధర్మరాజు- తథాగతుఁడు - భగవానుఁడు -లోనగు నామము లిడిరి. వంశమునుబట్టి శాక్యసింహుఁడను పేరుగలిగెను.

బంధువులందఱు సిద్ధార్థుఁడు మహాచక్రవర్తియై శాక్య వంశకీర్తిని ప్రదీప్తము చేయునని సంతసించుచుండిరి. కాని ఆతఁడు జనించిన ఏడవదినమున మాయాదేవి మరణించెను.

శుద్ధోదనుఁడు నుశ్వారు దాదుల నేర్పఱిచి బిడ్డను వారల కొప్పగించెను. బాలుఁడు రెండు మూఁడు నెలలా

వాఁడై యుండఁగా నాగళ్ళపండుగ వచ్చెను. రాజు తన కుమారుని వెంటఁ దీసికొనిపోయెను. పండుగ సందడిలో బాలుని ఒంటరిగా దిగవిడిచి ఎవరిత్రోవను వారుపోయిరి. అప్పుడతఁడు రోదనము సేయక ధ్యాననిష్ఠయం దుండెను. చెట్లు అతనికి అటువైపు తిరిగిన నీడలను అతని పైబడ జేసి సేవించుచుండెను.

తన కుమారుఁడు చక్రవర్తి కావలయునని శుద్ధోదనుఁడు కోరుచుండెను. బుద్ధుఁడగునని దైవజ్ఞులు నిశ్చయముగా జెప్పిరి. అది విన్నప్పటినుండియు శుద్ధోదనుని విషాదమునకు మేర లేకుండెను. తన ప్రియపుత్రుఁడు సన్యాసియై భిక్షాపాత్రపూని సంచరించుట తలంచుకొనినతోడనే అతని హృదయము పగిలిపోవుచుండెను. మఱల నతఁడు జ్యోతిష్కులను రావించి, "ఎట్టిసమయమున నాపుత్రుండు సర్వసంగపరిత్యాగియగు" నని ప్రశ్నించెను. "వృద్ధుని, రోగిని, మృతుని, సన్యాసిని చూచినపిదప సన్యాసియై పోవునని చెప్పిరి. ఆపలుకులు చెవిఁబడినతోడనే కొడుకును విరాగిగాకుండఁజేయు సాధనము తనచేతఁ జిక్కెనని భావించి, శ్రద్ధాళువులగు బంట్లతో తన కుమారుని కొద్దకు వృద్ధాదులగు నాల్గుతెగలవారిని రానీయవలదని శాసించెను. బంట్లు రాజాజ్ఞ శిరసావహించి జాగరూకతతో మెలగుచుండిరి. శుద్ధోదనుఁడును నందనునకు నివాసయోగ్యములగు మూఁడు మేడలు కట్టించెను. ఉద్యానవనంబుల నిర్మించెను. కుమారుఁడందు విహరింపఁ జేయుచుండెను. కుమారునకు [illegible] గోరి రాజు

పుత్రికయగు యశోధరాదేవి నిచ్చి వివాహము చేసెను. నలువది వేలమంది భోగభార్యలను సమకూర్చెను. ఈభోగభార్యలు శృంగారచేష్టలచే సిద్ధార్థునకు మనఃపారవశ్యము గల్పించుచుండిరి. సిద్ధార్థుఁడు భూలోకస్వర్గ మనుభవించుచుండెను

శుద్ధోదనుఁడొక పుణ్యముహూర్తమున కొమరుని గోడలిని వెండిపీఠముపై కూర్చుండఁబెట్టి శిరస్సులపై కిరీటములనునిచి పట్టాభిషేకము చేసెను.

అనంతర మతఁడు సామంతులతో రాజబంధువులతో "మీరందఱు మీపుత్రికలను సిద్ధార్థునకు ఉపభార్యలుగఁ జేయుఁడ"ని శాసించెను. వారు శుద్ధోదనున కిట్లనిరి అయ్యా సిద్ధార్థుఁడు రాజపుత్రుఁడయ్యు నొకశాస్త్రమేని నేర్వలేదు. ధనుర్విద్య మొదలే ఎఱుఁగఁడు. శత్రువు లెదుర్కొనినపుడు మాపుత్రికల మానప్రాణముల నెటఁబెట్టు కాపాడఁగలఁడు.

ఆపలుకులు సిద్ధార్థుఁడు విని తన విద్యానైపుణ్యము నెల్లవారికిఁ జూపింపనెంచి, భటులచే నిట్లు చాటింపఁబంచెను. "సిద్ధార్థుని శస్త్రాస్త్ర విద్యానైపుణ్యము చూడఁదలచినవారు రాజాంతఃపురమునకు రావలసినది." నియమితదినమున వేన వేలుజనులు గుమిగూడిరి. అపుడు సిద్ధార్థుఁ డొకవిల్లు తెమ్మని ఆజ్ఞాపించెను. వేయుమందిజనులు మోయుచు ఒకవిల్లును తెచ్చిరి. ఆమహాధనుస్సును సిద్ధార్థుఁడు కూర్చుండియె కుడికాలి బొటనవ్రేలి కొటిమీఁదనిలిపి, వ్రేలికొటితో వింటినారి నవలీలగా లాగెను. జ్యానాదము సహస్రయోజన

దూరము వినఁబడియె. అంత సిద్ధార్థుడు వరుసగానున్న నాలు
గరటి చెట్లపై అమ్ము విడిచెను. ఆ బాణము అరఁటులన్నింటిని
దూసికొనిపోయి ఆవలపడెను. అంత తనకు అష్టాదశ విద్యల
యందుగల అసమాన పాండిత్యమునుజూపి చూచువారలకు
ఆశ్చర్యము కల్గించెను.

ఇచట మరల మనము మహిమలలోఁ బడిపోయినాము.
వేయిమంది మోసినవిల్లు అతఁడు కాలిప్రేలితో మీటుటయు
వేయి యోజనముల దూరము ధనుష్టంకారధ్వని వినఁబడు
టయు గురుముఖమునఁ జదువకయే యాతఁడు విద్యాపారం
గతుఁడగుటయు అతిశయోక్తులే. కొందఱు చరిత్రకారులు
సిద్ధార్థునకు అయిదుగురు గురువులుండిరని వ్రాసినారు.
మొదటి గురువు సుదంతుఁడు. తరువాత గురువు సుబ్బమి
త్రుఁడునని మఱికొందఱు స్పష్టముగాఁ జెప్పిరి. కావున అతఁడు
గురువులయొద్ద విద్యనేర్చియుండుట సత్యము. భోగభార్యల
సంగతియు, ఉపభార్యల సంగతియు అతిశయోక్తులనియే
తలపవచ్చును. ఏలయన చాలమంది సిద్ధార్థునకు యశోధర
యనునొక భార్యయే కలదని వ్రాసియున్నారు. గోప-మనో
హర-మృగయ-యను భార్యలుకూడఁ గలరని మఱికొందఱు
వ్రాసిరి. కాని ఆపేరులన్నియు యశోధరకు మాఱుపేరులని
చరిత్రకారులు పరిశోధించి నిర్ధారించియున్నారు.

ఒకనాఁడు ఉద్యానవనమున విహరింప నభిలాష పొడ
ముటచే సిద్ధార్థుడు అరదముపై నెక్కి బయలువెడలెను. దారి
యందు ఒక వృద్ధుడాతని కంటఁబడియె. అతఁడు కల్య

మాత్రావశిష్టుఁడు. అడుగుదీసి అడుగు పెట్ట లేకుండెను. అతనిని జూచి సిద్ధార్థుడు సారథితో "చెన్నా! ఈతనికి శరీరములో రక్తమంత మాంసమైన లేదేమి! దంతములూడి తల నరసి నడుము వంగినదేమి" అనఁగా సారథి యిట్లనియె. "అయ్యా! ఇతఁడు వృద్ధుఁడు. ఇంద్రియములు వికలములైనవి. బంధుమిత్రులు ఈతనిని విడుచుటచే నిస్సహాయుఁడై యున్నాఁడు. ఎట్లయ్యును వార్ధకము ప్రతి జీవికి వచ్చును. అపుడు అందఱు నిట్లవస్థపడవలసినదే." అమ్మాటలు విని సిద్ధార్థుఁడు విరక్తితో రథము మఱలనిమ్మని గృహాభిముఖుఁడయ్యెను. ఈ విషయమంతయు శుద్ధోదనుఁడు తెలిసికొని భటులను మందలించి వలయు కట్టుదిట్టంబులు చేసెను. మఱలఁ గొంత కాలమునకు సిద్ధార్థుఁ డుద్యానవనము చూచుటకై రథమెక్కి మరల బయల్వెడలెను. త్రోవలో ఒకరోగి అతనికంటఁబడెను. ఉపచారములు చేయు వారలేక వట్టినేలంబడి మూల్గుచుండెను. "సారథీ! ఈతఁడెవ్వఁడు. మలమూత్రములలో దొరలుచు మిక్కిలి బాధపడుచున్నాఁడు" అని యడిగెను. అనఁగా సారథి ఇట్లనియె. "స్వామీ! ఇతఁడు రోగపీడితుఁడైయున్నాఁడు. ఎంతమాత్రము జీవితో లేడు! నేఁడో, రేపో మృతి చెందును." రాజకుమారుఁడు చింతాక్రాంతమనస్కుఁడై గిఱుక్కున రథము మరలించి గృహమార్గము పట్టెను.

మరలఁ గొంత కాలమునకు సిద్ధార్థుఁడు పూఁదోఁటఁ జూడ రథముపై నెక్కి పోవుచుండెను. కొందఱు మనుష్యులు శవమును మోసికొని అతని కెదురుగా పోవుచుండిరి. అంత

సిద్ధార్థుఁడు సారథితో "ఈతనినిట్లు మంచముపై కట్టి మోసి కొనిపోవుచున్నారేల! వెనుకనున్న మనుష్యులు దుఃఖించుచున్నారేల!" అనఁగా చెన్నుఁడిట్లనియె. "స్వామీ! మంచముమీఁది మనుష్యుఁడు మృతిచెందినాఁడు. అతఁడిక ఎట్టి ప్రియబంధువుతోడను పలుకఁజాలఁడు. అతఁడీప్రపంచమును విడిచినాఁడు." అదివిని రాజకుమారుఁడు విరక్తిచెంది, "మునలితనమున వృద్ధపోవు ఈయౌవనమేల! రోగపూరిత మైన ఈశరీరమేల!" అని రోసి గృహమునకు మరలెను. కొన్నాళ్ళట్లు విరక్తిచెంది ఎవ్వరిని జూడనొల్లకయుండె. వెండియు నొకనాఁడు తోఁటకరుగుచుండెను. అప్పుడచటి కొక సన్యాసి కనఁబడెను. "సారథీ! ఈతఁడెవ్వఁడు! ఈ కాషాయవస్త్రము లేల! ఈశాంతస్వభావమేమి! ఎవరిని జూడఁడు. ఎవరితో మాటలాడఁడు." అని ప్రశ్నించునాతనికి సారథి ఇట్లనియె. "స్వామీ! ఇతఁడు సన్యాసి. బిచ్చమెత్తుకొని జీవించును. ప్రపంచసంబంధము వదలినాఁడు, ఇంద్రియములజయించినాఁడు" అన సిద్ధార్థుఁడు సంతోషపడి, "మంచిది. ఈయాశ్రమము నాకు ఇష్టమైనది" అని గృహమునకు మరలెను.

సిద్ధార్థుఁడు ఈ నాల్గురకములవారిని సిద్ధార్థుఁడు చూడనేలేదనియు లోకానుభవమువలనను తత్త్వబుద్ధిచేతను యౌవనంబు క్షణభంగురమనియు, శరీరము రోగభూయిష్ఠమనియు ప్రపంచక మాయాపూరితమనియుఁ దెలిసికొని విరక్తి చెంది, ప్రశాంతమైన సన్న్యాసాశ్రమము సంతుష్టికి మూలా

కారణమని నిశ్చయించుకొనెనని కొందరు వ్రాయుదురు. ఈ యభిప్రాయమే నిశ్చయము కావచ్చును. లేదా, నాల్గుదృశ్యముల వానివలనగాని విరక్తి చెందియుండవచ్చును. ఉత్తముడై అయినను సంసారమున విరక్తి కలిగెను. త్రోవలో పోవునపుడు మనవంటివారికిని విరక్తి కల్పించు దృశ్యము లనేకములు కన్పడుచుండును. ఇట్టి సిద్ధార్థునకు విరక్తి కల్గుటయం దాశ్చర్య మేమి!

ఒకనాడు సిద్ధార్థుడు తోటయందు విహరించుచు గృహమునకు మరలుటకు సిద్ధముగానుండెను. అపుడొక భటుడువచ్చి "స్వామీ! పుత్రుడు జన్మించినాడు" అనిచెప్పెను. రథమెక్కబోవుచున్న సిద్ధార్థుడామాట విని "ఓహో! ఇదియొక రాహులమా (ఆటంకమా") అని విరక్తితో బలికెను. శుద్ధోదనుడు ఆసంగతి తెలిసికొనిమనుమనికి రాహులుడని పేరు పెట్టెను. సిద్ధార్థుడు విచారగ్రస్తుడై గృహమునకు బోవుచుండెను.

పురజనులు సంతోషభరితులై ఉత్సవములు చేసికొనుచుండిరి. ఆనందాతిశయమున వారు సిద్ధార్థుని రథము చుట్టుముట్టి "కులవిస్తారకుడగు పుత్రుడు జన్మించినాడు. మహారాజునకు జయమగుగాక" అని జయధ్వానములు చేసిరి.

ప్రజలుచేయు జయధ్వనులలో సిద్ధార్థునకు చెవుల కింపైన గీతమొకటి వినబడెను. అగీతమును పాడినది సిద్ధా

ష్ఠుని కూఁతురాలు. అవివాహిత, గుణసంపన్నురాలు. ఆమె పాడినగీత భావమిది:—

"ఇట్టితనయుని గనిపెంచిన తల్లిదండ్రు లవనిలో ధన్యులు.
ఈతనిభర్తగఁ బడసిన భార్య స్త్రీలలో ధన్యురాలు."

ఆగీతమునువిని సిద్ధార్థుఁడిట్లు తలఁచెను. "ఏమి తల్లిదండ్రులును భార్యయు ధన్యులా? అనఁగా సౌఖ్యవంతులా? ఇట్టి సౌఖ్యమెట్లు కల్గును? ఈ గీతము పరమార్థము నాకు ప్రబోధము గొలుపుచున్నది."

ఇట్లు చింతించి లక్షవరహాలుచేయు హారమామెకు కానుకగా పంపెను. అదిచూచి, సిద్ధార్థునకు తనమీఁద వలపుగలదని ఆమె తలంచెను. కాని సిద్ధార్థుఁడామెను మరల జూడలేదు.

సిద్ధార్థుఁడు అంతఃపురమునఁ బరుండియుండెను. అతని మనసు పరాయత్తమై యుండెను. నాట్యకత్తెల గాన నృత్యంబు లెదమెచ్చక నిద్రించెను. అర్థరాత్రమున అతనికి మరల మెలఁకువ వచ్చెను. అంతఃపురమున యథేచ్ఛముగ పరుండిన విలాసవతులు నిద్రించుచుండిరి. కొందఱి శరీరముల వస్త్రములు తొలఁగియుండెను. కొందఱి కొప్పులు వీడియుండెను. అంతకుముందు వారు సింగారించుకొని యుంటచే వారిలోపము కనఁబడకుండెను. అపుడు వారి వికారమంతయు బైటఁబడుచుండెను. ఆ యసహ్య ప్రదర్శనానంతరము అతని నోట నీక్రిందిమాటలు వెడలెను. "ఇది ఎల్ల మున్నహము" అంతఃకరణమాతఁడు "ఎవరక్కడ" అని కేకవేయ చెన్నఁడువచ్చె

చేతులు మోడ్చి ఎదుట నిల్చుండెను. అంత సిద్ధార్థుడు "చెన్నా! నేను సర్వసంగ పరిత్యాగము చేయ సంకల్పించుకొంటిని. సిద్ధపఱిచి గుఱ్ఱమును తీసికొనిరమ్ము" అని యనియె. చెన్నుడు పోయి గుఱ్ఱమును సిద్ధపఱిచెను.

మనము సిద్ధార్థుని సర్వసంగ పరిత్యాగమునకు నిజమైన కారణము లెవ్వి అని ఆలోచింపవలయును.

1. వృద్ధాదుల దర్శనమా ? 2. కిసగౌతమి గీతమా ? 3. భోగస్త్రీల సహజ వికారరూపమా ? ఇవి అసలు కారణములు కాజాలవు. మన కెంతమందికి ఇట్టివి నిత్యముగ పడుట లేదు. మనమందఱము సర్వసంగపరిత్యాగము చేయు చున్నామా ? లేదే. మఱేమనఁగా అసలు బుద్ధుడు ప్రకృతి చేతనే తత్త్వజిజ్ఞాసువు. అందుపై నాతఁడు వేదాంతశాస్త్రాదులను జదివియుండును. ఆ రెంటి కలయికచే వైరాగ్య బీజములు పుట్టియుండవచ్చును.

ఆబీజములు వృద్ధాదుల దర్శించుటవలన క్రమముగా పెరిగియుండవచ్చును. కిసగౌతమీగీతము. కాంతల వికార స్వరూపము వెంటనే ఫలముకల్గించు దోహదములై యుండ వచ్చును. వేసవిగాడ్పులచే ఎండిఎండియున్న కట్టెలను రవంత యగ్నికణమే ప్రజ్వరిల్లఁ జేయగల్గినట్లు వృద్ధాదులకు సంబంధించిన నాల్గుహేతువులును జిజ్ఞాసచే పరిపక్వమైన అతనిమనమున మహావైరాగ్యము ఉదయింపఁ జేసియుండును. అనఁగా నివి నిమిత్తకారణములే కాని సమస్తకారణములు గావు. ఈవిషయమును బుద్ధుఁడైన పిదప అతఁడు తన శిష్యు

లతో 'తన శరీరము వార్ధకావస్థకు లోనగునని తెలిసియు ముసలివానినిజూచి ఏల కోఁతపడవలయున'ని చెప్పిన బోధల వలన స్థిరపఱుచుకొనవచ్చును.

ఇందులకు తోడుగా సర్వరాజ్యమును విడిచి తపో నిరూఢులై వెడలిపోయిన దేవాపి మొదలగువారి చరిత్రములు వైరాగ్యోదయమైనపుడు వివేకు లెట్లు నడువవలయునో అతనికి తెలిసియుండును. అందుచే నాఁడు గృహమునుండి వెడలిపోఁదలంచి యుండును.

చెన్నుఁడు హయమును సిద్ధపఱచి తెచ్చువంతలో సిద్ధార్థుఁడు తన భార్యాపుత్రులను కడసారి చూడఁదలఁచెను. యశోధర పూలపాన్పుపై పరుండి పిల్లవానిపై చేయిడి నిద్రించుచుండెను. పిల్లవాని నెత్తుకొని ముద్దాడవలయునని అతఁడు తలఁచెను. కాని అందుచే నిద్రాభంగము చెంది భార్య తన ప్రయత్నమును శాపములతో మాన్పునేమోయని భయపడి పోయెను. అతఁడటనుండి బయటికి వచ్చునప్పటికి చెన్నుఁడు హయముతో సిద్ధముగా నుండెను. సిద్ధార్థుఁడు గుఱ్ఱమెక్కి, ఆ అర్ధరాత్రమున అందఱిని విడిచి వెడలిపోయె. చెన్నుఁడు మాత్రము ప్రభువును విడువక వెంటనంటి పోవుచుండెను.

సిద్ధార్థుఁడు రోమానదీతీరమున జేరి సకలాభరణములు తీసి చెన్నునకిచ్చి పురమునకుఁ బొమ్మని చెప్పెను. చెన్నుఁడు తానుగూడ సంసారమువిడిచి ప్రభువునకు శుశ్రూష చేయు చుందునని తెలిపెను. సిద్ధార్థుఁడది సరియైనకాలము కాదు

నియు ముమ్ముందు అట్లు చేయవచ్చుననియుఁ దెలిపి పురం బున కడుగుమని నొక్కి చెప్పెను.

చెన్నడు సమ్మతించిపోఁబోవ "చెన్నా! తలిదండ్రుల తోడను భార్యతోడను పురజనులతోడను నేను సన్న్యాసి నైతినని చెప్పుమనియె.

చెన్నం డేడ్చుచు పురమునకుఁ బోయిన పిదప సిద్ధా ర్థుఁడు తన ఖడ్గముతో వెండ్రుకలను ఖండించుకొని సన్న్యా సియై రాజగృహనగరమునకుఁ బోవ దలఁచెను. అప్పటి కాతని మనస్సు ప్రశాంతమయ్యెను. సంసారసంబంధములపై రోఁతపుట్టెను.

ఆయన కప్పుడు వెనుకటి చుట్టములు చుట్టములు గాకైరి. యోగులు తపస్వులు సన్న్యాసులు దగ్గరచుట్టము లైరి. అతఁడు సమస్తమునందును సమదృష్టిగలిగి జీవితశేషం బును గడుపఁదలంచెను. తపంబుచేసి మోక్షమార్గమును కనుగొనవలయునని అతని సంకల్పము. వార్ధకమునకు రోగమునకు అతీతమైన అవస్థలో నుండవలయునని అతని ఆశయము.

అంత సిద్ధార్థుఁడు రాజగృహమునకుఁ బ్రయాణ మయ్యెను. ఆకాలమున రాజగృహము మగధరాజ్యమునకు రాజధాని. మగధరాజ్యము పాండవుల కాలమునుండియు ప్రసిద్ధి వహించినది. భారతకాలమున జరాసంధుఁడు మగధ రాజ్యమును పాలించుచుండెను. అతనికాలమున గిరివ్రజము రాజధాని. గిరివ్రజమనఁగా కొండలచే చుట్టఁబడినదని

యర్థము. గోరథము-ఋషభము-వైహారము-ఋషిగిరి-చైత్యకము అనునవి గిరివ్రజము చుట్టును ఆవరించియుండెను. క్రమముగా అపురమే గిరివ్రజముగా మాఱినది. మౌర్యుల కాలమున గిరివ్రజముగాక పాటలీపుత్రము రాజధానిగా మార్చబడెను. రాజగృహము నేటికిని రాజఘర్ నామమున బీహారురాష్ట్రమునఁ గలదు. ఇపుడది చిన్నగ్రామము. హిందువులకును జైనులకును పుణ్యక్షేత్రము.

బుద్ధుని కాలమున మగధరాజ్యమును బింబిసారుఁడు పరిపాలించుచుండెను. రాజగృహము చుట్టునుండు పర్వతములమీఁద నివసించు విద్వాంసుల నాశ్రయించి జ్ఞానసంపాదనము చేయవలయునని సిద్ధార్థుని సంకల్పము. అతఁడు పురప్రవేశము చేసినతోడనే, పురజను లాతఁడెవఁడో మహాత్ముడనుకొని రాజున కావార్త ఎఱింగించిరి. రాజు సిద్ధార్థుని జూడవచ్చెను. రాజుతో అతఁడు తానొక భిక్షుకుఁడనని చెప్పెను. సమస్తద్రవ్యముల నిచ్చెదను, నానగరునకు రమ్మని రాజు బలవంతపెట్టెను. సిద్ధార్థుఁడు రాజభవనమునకుఁ జనక గిరులకరిగి అచటి బ్రాహ్మణపండితుల నాశ్రయించి వేదాంతశాస్త్రాది దర్శనములు పఠించెను. అవి సిద్ధార్థునకు సంతుష్టి నొసఁగఁ జాలవయ్యె.

అతఁడంత తపస్సుచేయఁ దలంచెను. ఆకాలమున సంసారవిముఖులైన మహాపురుషు లనేకులు పెక్కు విధములైన బాధాకరములైన తపోవిధానముల నవలంబించుచుండిరి. సిద్ధార్థుండును ఉరువేల మహావనంబున కరిగి యచట భయం

కరనియమంబులఁ బూని ఆఱుసంవత్సరములు ఘోరమైన తపమాచరించెను. అతనిశరీరము శుష్కించి రక్తమాంసము లెండిపోయెను. అప్పు డాయనయొద్ద అయిదుగురు శిష్యులుం డెడివారు. ఆయనచేయు ఘోరతపము వారికిఁ గూడ వెఱపు పుట్టించుచుండెను. తుదకు ఆయనశరీరము నల్లపడెను. మున్ను అతని మేనకనఁబడు కల్యాణలక్షణము లన్నియు రూపఱెను. ఒకనాఁడు రాత్రి తెల్లవారుజామున శరీరదార్బల్యముచే అతఁడు మూర్ఛిల్లెను.

సిద్ధార్థుఁడు తెప్పరిల్లి లేచి తపస్సువలన ప్రయోజనము లేదని భావించెను. అతఁడు శోషించియున్న స్థితియందు సుజాతయను కాపుస్త్రీ అతనికి అన్నము తెచ్చి పెట్టెను. అందుచే అతని ప్రాణములు నిలిచెను. ఆమె చేసిన యుపకారమును అతఁడు జన్మాంతమువఱకు మఱువలేదు. కొంచెము దేహదార్ఢ్యము కలిగినతర్వాత సిద్ధార్థుఁడు సన్న్యాసి యయ్యెను. అంత ఆయన ధర్మభ్రష్టుఁ డైనాడనియు' నాస్తికుండైనాడనియు, భావించి శిష్యులైదుగురు వెడలిపోయిరి.

సిద్ధార్థుఁడు నిరంజనీనదీతీరమున మెల్లగాఁ బోవుచుండెను. సుజాత మఱల కనఁబడి మధ్యాహ్నభోజనము ఒక మఱ్ఱిచెట్టుక్రింద బెట్టెను. నాటినుండి యావృక్షమునకు జ్ఞానవృక్షమని పేరుగల్గెను. ఏలయన ఆవృక్షముక్రిందఁ గూర్చుండి వేదాంతవిచారము చేయుచుండ సిద్ధార్థునకు జ్ఞానోదయ మయ్యెను. ఆవృక్షప్రాంతము నిపుడు బుద్ధగయ [illegible]. నిరంజనీనది నిపుడు ఫల్గునది యందురు. బుద్ధ

గయలో బుద్ధదేవాలయమున నొక మఱ్ఱివృక్ష మున్నది. ఈ వృక్షముక్రింద కూర్చుండియే సిద్ధార్థుఁడు బుద్ధుఁడయ్యెనని బౌద్ధులు నమ్ముదురు. మొదటి వృక్షము నశించినదనియు, ఇప్పటివృక్షము దాని సంతతియే గావచ్చుననియు పెక్కురు తలంతురు.

మఱ్ఱిచెట్టుక్రింద కూర్చుండి జ్ఞానమును పొందుటకు ముందు సిద్ధార్థుని మనస్సున గొప్పకలవరము కల్గెను. అతఁడు తనమనస్సులో "వేదాంతవిద్యలుగాని, ఘోరతపముగాని ఫలమీయ లేకపోయినది. ఇంటికిఁబోయి సుఖముగ నుందునా" అని అనుకొనెను. ఈతలంపును త్రోలివేయుటకును, ఆభోగములనుండి మనస్సును మరలించుటకును అతని మనములో గొప్పయుద్ధము జరిగెను. ఈదురాలోచనములన్నియు మారుని వలనఁ గలిగెనని సిద్ధార్థుఁడు నమ్మెను. మారుడనఁగా "మన్మథుఁడు. దుర్బుద్ధులు పుట్టించు దేవత. మృత్యుదేవత" అని పెక్కండ్రు పెక్కర్థములు చెప్పుచున్నారు. అపుడు మారుఁడు ప్రత్యక్షమై సిద్ధార్థునితో "ఓయీ! లెమ్ము, నీకు మరణమాసన్నమైనది" అని అనియె. సిద్ధార్థుని మనస్సు నిశ్చలమైయుండెను.

అంత మారుఁడు సైన్యంబుల కూర్చుకొని యుద్ధమారంభించెను. అతని సైనికులు నానావిధాయుధములు ధరించి, నానావిధ రూపములతో నానావిధములుగా శబ్దించుచు, నానావిధ వికారచేష్టలు చేయుచు సిద్ధార్థునిపై యుద్ధమునకు గడంగిరి. సిద్ధార్థుని తలమీఁది వెండ్రుకలైనను

కదలకుండెను. అంత మారుఁడు చిన్నవోయి గృహమున కేగెను.

మారయుద్ధము ముగియునప్పటికి సిద్ధార్థునిమనస్సు ప్రశాంతమైయుండెను. పుణ్యరూపుఁడైన సిద్ధార్థునకు పాప రూపుఁడైన మారునకు యుద్ధము జరుగునపుడు, నక్షత్రములు నేలరాలుట, భూమికంపించుట, సముద్రము కలఁతచెందుట, నదులు ఎదురుప్రవహించుట, పర్వతశృంగములు విరిగి నేలఁ గూలుట, తుపాను కల్గుట, మహాధ్వని వినఁబడుట, సూర్య మండలమునఁ జీఁకట్లు క్రమ్ముట, తలఁలేని భూతము లాడుట, లోనగు మహాద్భుతములు పెక్కు పుట్టినవి.

బుద్ధుఁడు తనశిష్యులతో ఒకప్పుడు మారునితో యుద్ధముచేయుటను గూర్చి యిట్లు చెప్పెను. "నేను నిరంజన నదీతీరమున ధ్యాననిష్ఠయుండుంటిని. అపుడు మారుఁడు నా యెదుటనిలిచి, "ఓయీ! మందభాగ్యుఁడా! నీకు మరణ మాసన్నమైనది. ఏదోవిధముగాఁ బ్రదికిన మంచిది. నీవు పోయి నిష్పాపకుఁడవై హోమాదు లొనర్పుము. శుభములు కల్గును" అనెను. అపుడు, నేను "నేను నిర్వాణమార్గము ప్రవేశింపఁగలను. నారక్తమాంసము లెండిపోయినకొలఁదియు నా మనసు ప్రశాంతమగుచున్నది. ఇఁక ఇంద్రియసుఖముల మీఁదికి నా మనస్సేల పోవును!

నాకునీతోఁబొత్తుకుదరదు. 1. భోగము 2. అసంతుష్టి 3. తృష్ణాబుభుక్షలు 4. కామము 5. మాంద్యము 6. పిఱికితనము 7. సందేహము 8. అధర్మసంపాద్యములైన ప్రసిద్ధి

మొదలగునవిఅను నీయెనిమిది సైన్యములను దీసికొని వెడలి పొమ్ము. ఇట నీకేమిపని" అంటిని. మఱియొకమాఱు బుద్ధుఁడు తన శిష్యురాలగు రాధతో "రాధా! శరీరమెక్కడ నుండునో అక్కడ మారుఁడుండును. చంపెడువాఁడును చచ్చెడి వాఁడును మారుఁడె. కాఁబట్టి దేహమే మారుఁడని నమ్ముము. రోగాదులు మారరూపములే" అని చెప్పెను.

ఈపై సంభాషణములనుబట్టి మారుండని వేఱొక పురుషుఁడు లేఁడనియు మనస్సునఁబుట్టు వికారములే ఉరూప మున వర్ణింపఁబడినవనియు మనము సులభముగా నూహింప వచ్చును.

# నారదుని ఆత్మకథ

నేను బూర్వకల్పంబునఁ దొల్లింటిజన్మంబున వేదవాదుల ఇంటఁ బనిచేయుదాసికి జన్మించితిని. చాతుర్మాస్య దీక్షచే నొక్కచో నిలువఁదలచినిన కొందఱు మునీశ్వరులకు సేవచేయుటకై నేను బంపఁబడితిని.

వారలకు పొరపాటు జరిగిన ఆగ్రహము వచ్చునేమో అను భయముతోడను, మిక్కిలి భక్తితోడను, ఇతర బాలురతో ఆటలకేనియుఁబోక నేనువారిని సేవించితిని.

వారలయెంగిలిని శుభప్రదమని భక్షింతును. పని చేయవలసి నప్పుడు వానయని యెండయని భయపడకుండెడి వాఁడను. నియతిమై ఎల్లపుడు వారిసన్నిధానముననే నిలిచి యుంటిని. తత్త్వబుద్ధితోఁబిచ్చి వానివలె సంతసించుచుంటిని.

ఈప్రకారముగా వర్షాకాలమును శరత్కాలమును వారలను సేవించితిని. వారును నాయందుఁ గృపతోనుండిరి.

వారొకప్పుడు శ్రీకృష్ణచరిత్రములను చదువుచుండిరి, ఒకప్పుడువర్ణించుచుండిరి. ఒకప్పుడుపాడుచుండిరి. అప్పటి యా ధ్వని అమృతమునకు సాటియై నా చెవులలో నిండిపోయెడిది. నామనస్సు అపరిమితానందమును పొందెడిది. ఇఁక ఇతరప్రయత్నముల నన్నింటిని వదలి నేనును హరిసేవ ప్రారంభించితిని.

ఇట్లు ఎల్లప్పుడు హరిభక్తియందుఁ దత్పరుఁడనై యున్న కారణమున ప్రపంచమునకంటె అతీతుఁడనై, బ్రహ్మరూపకుండనై, యున్న నాయందు స్థూలసూక్ష్మంబైన ఈ శరీరము మాయాకల్పితమే గాని వాస్తవముగాదని గుర్తించితిని; మఱియు ఆ మహాత్ములయొక్క కరుణవలన రజస్తమో గుణములను బోఁగొట్టునట్టి భక్తిజనించె. చాతుర్మాస్యదీక్ష ముగిసి; అయ్యోగిజనులు మరలయాత్ర సాగించువారై అపచారముగాని చపలత్వముగాని లేక, భక్తితోఁగూడిన నాసేవకు వారు ప్రీతిచెందుటయేగాక, కపటములేని వాత్సల్యముతోడను దయతోడను పరమేశ్వరునియొక్క తత్త్వజ్ఞానమును నాకు ఉపదేశించిరి.

నేనును వారల యుపదేశంబునం జేసి వాసుదేవునియొక్క మాయాప్రభావంబు దెలిసికొంటిని. కర్మములు ఈశ్వరునియందు సమర్పితంబులైనచో తాపత్రయంబులను మానుపఁజాలియున్నవి; నేను భిక్షులవలన విజ్ఞానంబు గలిగియుండఁగా మాతల్లి యజమానునియింటఁగల పనులన్నియు భక్తితోఁ జేయుచుండెడిది. తన అస్వతంత్రతను దలపకయే, అలసిపోతిని, సొలసిపోతిని, ఆకొంటిని, అనుచువచ్చి ఆమె నన్ను ప్రాతఃకాలసాయంకాలములయందుఁ బ్రేమతో ముద్దాడుచుండెడిది; పిల్లజుట్టు దువ్వుచుండెడిది; శరీరమును తడువుచుండెడిది; సంతసించి, ప్రేమతోఁ గాఁగిలించుచుండెడిది; ఇట్టి తల్లిని విడిచిపోలేక, అయిదేండ్ల ప్రాయమువాఁడనగుచుఁ గొన్ని వాసరము లింటియందే యుంటిని.

కాని మోహము చెందనైతిని. జ్ఞానమువిడువనైతిని. హరిచింతతప్ప ఇతరచింతలేని మానినై యుంటిని. ఒకనాఁటి రాత్రి చీఁకటివేళ మాతల్లిగోవులపాలు పిదుకుటకు బయలు దేరెను. మార్గమున జంకులేకయే పోవుచుండెను. త్రొక్కఁ బడిన యొకపాము ఆమె పదభాగమునఁ గఱచెను. నల్లని పడగకల యాపాముయొక్క విషమనెడి గొప్ప అగ్నిమంట లచే మాతల్లి నేలఁ వ్రాలెను. తరువాత నొక మహారణ్యంబు జేరి, ఒక అశ్వత్థవృక్షము సమీపమున కూర్చుంటిని. నేను వినిన రీతిగా, నాహృదయమందున్నట్టి వాసుదేవుని జింతించు చుంటిని.

నాకన్నులవెంట ఆనంద బాష్పములు కారుచుండెను. నాశరీరమున గగుర్పాటు గలిగెను. ఇట్లు వాసుదేవుని ధ్యానించుచున్న నామనస్సున ఆహరి పొడగట్టె. సంతోష సముద్రమున మునింగితిని. అంతలో అప్పరమాత్ముని, నన్నును గాంచఁజాలనైతిని. కాని నానాదుఃఖ నిర్మూలకమైన యాశ రీరమునుగూడఁ గాంచజాలనైతిని. అంతట నేను లేచి నిల్చుం టిని. మఱల ఆదేవుని దివ్యాకారముచూడవాంఛించితిని. ఆతు రతతో అద్దేవుని రూపంబు మనంబున నిలిపికొని చూచితిని; కానిచూడఁ జాలనైతిని. ఏమిచేయలేక నిర్జనంబైన యాయ రణ్యమున గ్రుమ్మరుచుంటిని. అట్టినన్నుఁజూచి, వాక్కులకు అందరాని వాసుదేవుఁడు గంభీరములును, మధురములును అగు వచనంబులతో శోకంబు ఉపశమింపం జేయుచు నిట్లనియె.

బిడ్డా! ఇట్లు శోషిల్లగానేల! ఈజన్మంబున నీవు నన్నుఁ గాంచఁజాలవు. కామక్రోధాదులగు అఱుశత్రువులను నిర్మూలించి సమస్తకర్మలను ఛేదించిన మునిశ్రేష్ఠుఁడు నన్నుఁ గాంచఁగలఁడు. అంతియ. కాని యోగిమాత్రుఁడు గాంచఁ జాలఁడు. నీభక్తి దృఢత్వము గొననాగుటకై మదీయ దివ్య రూపంబు ఒకపరి నీకుఁ జూపితి. వత్సా! వినుము. నాయెడఁ గల వాంఛ నిష్ఫలముకాదు. దోషముల నెల్ల సంహరించును. నాసేవాపరాయణత్వమువలన శీఘ్రకాలములోనే నాయందలి భక్తికల్గును. నాయందు నిలిపిన బుద్ధివ్యర్థముకాదు. వత్సా! నీవీదేహమును విడచి మఱియొక జన్మమున మాయొక్క యానతిచే మాయందు దృఢభక్తిగలవాఁడవై పుట్టఁగల్గుదువు.

బాలకా! వినుము. ఈసృష్టి నశించి యుగములు వేయైన కాలము రాత్రియైపోవును. అపుడు మఱల సృష్టి కలుగును. ఆసృష్టియందు నీవు పూర్వజన్మస్మృతితోడనే దోషరహితుఁడవై పుట్టెదవు. అపుడు నాకృపచేత శుద్ధ సాత్వికమూర్తులలోఁ శ్రేష్ఠుఁడవై మహత్వమును వహింతువు.

ఇట్లని ఆకాశశరీరుండును, ఋగ్వేదాదులు నిట్టార్పగా నొప్పినవాఁడును అగు సర్వనియామకుండు పలికి విరమించెను. నేనును శిరస్సువంచి నమస్కరించితిని. తత్కారుణకు సంతసించితిని. మదమాత్సర్యంబులు విడనాడితిని, కామక్రోధాదుల వెడలనడిచితిని.

లజ్జ విడనాడి మంగళకరంబులైన యనంత నామంబులు పఠించుచుంటిని. నిత్యానందుఁడనై కృష్ణునియందే బుద్ధినిల్పి

యుంటిని. నిర్మలమైన మనస్సుతో విషయంబులనుండి విర క్తుండనై కాలమును ప్రతీక్షించుచుంటిని.

ఇట్లు కృష్ణునియందే బుద్ధినిలిపి పుడమిపై సంచరించు చుండునంతి కొంతకాలంబునకు మెఱుంగు మెఱసిన తెఱం గున మృత్యువు ఆసన్నంబయ్యె. అపుడు పంచభూతములతో గూడిన దాసీపుత్రదేహము ప్రారబ్ధకర్మ క్షయకారణంబున నశించెను.

హరికృపచే భాగవతదేహంబుఁ జొచ్చితి. అపుడు త్రిలోకములను సంహరించి ప్రళయకాల సముద్రమధ్యమున విడురింప నిచ్ఛగించు శ్రీమన్నారాయణమూర్తిలోన శయ నింపఁ దలఁచు బ్రహ్మదేవుని మధ్యమును నిశ్వాసంబుతోడం జొచ్చితి.

ఇట్లుండ సహస్రయుగంబులు గతించె. బ్రహ్మ దేవుండులేచి విశ్వంబు సృజియింప నుద్యోగించుచుండె. ఆ చతుర్ముఖుని ప్రాణంబులనుండి మరీచి, వసిష్ఠుఁడు మొద లగు మునులును నేనును జన్మించితిమి.

పిదప నేను భగవంతుని యనుగ్రహ విశేషంబున అఖండ బ్రహ్మచర్యవ్రతము నలుపుచు, త్రిలోకంబుల అంతర్బహిర్భాగములనెల్ల సంచరించుచున్నాను. ఈశ్వ రునిచే ఇయ్యఁబడిన ఈవీణె నాదబ్రహ్మముచే భూషితంబై యుండు. ఇందలి సప్తస్వరంబులు తమయంతన మ్రోయు చుండు. ఈ వీణాలాపమునఁ దత్పరుఁడనై హరికథా గానము

చేయుచు, తిరుగుచున్నాను. నేను తన చరిత్రమును ఆస
క్తితోఁ బాడుచుండఁగా, పవిత్రపాదపద్ముఁడైన వాసు
దేవుఁడు పిలువఁబడినవానివలె వచ్చి నామనమునఁ గాన
వచ్చుచుండును.

మునీంద్రా! వినుము, సంసారసముద్రమున మునిగి, కర్మబంధములం జేసి, వేదనఁబొందు పురుషునకు విష్ణునామ సంకీర్తనము తెప్పయేగదా! కామరోషాదులచే తిరస్కృతం బైన మనస్సు విష్ణుసేవచే శాంతించినయట్లు యమనియమాది యోగానుష్ఠానంబున లెస్సయుపశమింపదు. మునీంద్రా! మదీయజన్మరహస్యము నీప్రశ్నకుఁ బ్రత్యుత్తరముగా వివరించితినిగదా! అని వీణెవాయించుకొనుచు స్వేచ్ఛాసంచారి యగు నారదుండు చనియె.

---

కళ్యాణి ప్రెస్; తెనాలి—11-45/-50 కాపీలు.